



# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# దాశరథి శతకము








సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016480

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

# దాశరథీశతకము

(టీకాతాత్పర్యసహితము.)

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.

1937

కాపీరైట్ రిజిస్టర్డు]

[వెల 0—4—0.

శ్రీ ర స్తు.

# దాశరథీశతకము

టీకాతాత్పర్య సహితము.

(కంచెర్ల గోపకవి ప్రణీతము.)

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణ బుక్ డిపో,

రాజమహేంద్రవరము.

1937

కాపీరైటు రిజిష్టర్డు.]

[వెల 0—4—0.

శ్రీ ర స్తు.

# దాశరథీశతకము.

శ్రీరఘురామ, చారుతుల ♦ సీదళదామ, శమక్షమాది శృం
గారగుణాభిరామ, త్రిజ ♦ గన్నుతశౌర్య రమాలలామ దు
ర్వార కబంధ రాక్షస విరామ, ♦ జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. శ్రీ=సంపదతోఁగూడిన, రఘు=రఘునికులమునబుట్టిన, రామ=మనోహరుఁడా! చారు=మనోహరమైన, తులసీదళ=తులసీదళముచేనగు, దామ=దండగలవాఁడా, శమ=శాంతి, క్షమ=ఓర్పు, ఆది=మొదలైన, శృంగార=మనోజ్ఞములగు, గుణ=గుణములచేత, అభిరామ=మనోహరుఁడైనవాఁడా, త్రిజగత్=మూఁడులోకములచేత, నుత=పొగడబడిన, శౌర్య=పరాక్రమముయొక్క, రమా=సంపత్తియనెడి, లలామ=ఆభరణముగలవాఁడా, దుర్వార = వారింపరాని, కబంధరాక్షస = కబంధుఁడను రాక్షసుని, విరామ = హరించినవాఁడా, జగత్ = లోకమందలి, జన = జనులయొక్క, కల్మష=పాపములనెడి, అర్ణవ=సముద్రమును, ఉత్తారక=దాటించునట్టి, నామ=పేరుగలవాఁడా, కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడును, భద్రగిరి=భద్రాచలమందు వేంచేసియున్న, దాశరథీ=దశరథుని కుమారుఁడైన శ్రీరామా.

తా. శ్రీరఘువంశమునపుట్టి అందమైన తులసిదండ దాల్చి, శమక్షమాది సద్గుణంబుల నొప్పి, మూఁడు లోకము

లందును పొగడ్తకెక్కిన పరాక్రమసంపత్తిచే శోభిల్లి, కబంధు నడంచి లోకుల పాపములను దొలగించు కరుణాసముద్రుఁడవై భద్రాచలమందుండు దశరథ కుమారుడవైన రామా.

ఉ. రామవిశాలవిక్రమ ప ♦ రాజిత భార్గవరామ, సద్గుణ
స్తోమ, పరాంగనావిముఖ ♦ సువ్రతకామ వినీల నీరద
శ్యామ, కకుత్స్థవంశ కల ♦ శాంబుధిసోమసురారిదోర్బలో
ద్ధామవిరామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 2

టీ. రామ=అందఱ రమింపఁజేయువాఁడా, విశాలవిక్రమ=ఎక్కువ బలముచే, పరాజిత=ఓడింపబడిన, భార్గవరామ=భృగువంశమునబుట్టిన పరశురాముఁడుగలవాఁడా, సద్గుణస్తోమ, సత్ + గుణ=మంచిగుణములయొక్క, స్తోమ=సమూహమైనవాఁడా, పరాంగనా=పరస్త్రీలయందు, విముఖ=పెడమొగముగల, సువ్రత=మంచివ్రతమునందు, కామ=ఆసక్తిగలవాఁడా, వినీల=మిక్కిలినల్లనయిన, నీరద=మేఘమువలె, శ్యామ=నల్లనయినవాఁడా, కకుత్స్థ=ఇక్ష్వాకువంశ్యులలో నొకఁడైన రాజుయొక్క, వంశ=వంశమనెడి, కలస + అంబుధి=పాలసముద్రమునకు, సోమ=చంద్రుఁడైనవాఁడా, సురారి=దేవతలకు శత్రువులయిన రాక్షసులయొక్క, దోర్బల=బాహుబలముయొక్క, ఉద్దామ=అత్యంతమైన, విరామ=ఉడుగుటగలవాఁడా, కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడా, భద్రగిరిదాశరథీ=భద్రాచలవాసుఁడవైన రామా.

తా. సౌందర్యాదుల సర్వజనులను రంజింపుచు, పరాక్రమముచే పరశురాముని గెలిచి, పరస్త్రీలయం దాసక్తి లేక నల్లని మబ్బువంటి దేహకాంతితో నొప్పి, కాకుత్స్థవంశమును వర్ధిల్లఁజేసి, రాక్షసులబలమునడంచి దయకలవాఁడవై యొప్పుచున్న భద్రాద్రి రామా.

చ. అగణిత సత్యభాష శర ♦ ణాగతపోష, దయాలసజ్ఝరీ
విగత సమస్తదోష, పృథి ♦ వీసురతోష, త్రిలోకపూతకృ
ద్గగనధునీమరంద పద ♦ కంజ విశేష మణిప్రభా ధగ
ద్ధగిత విభూష భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 3

టీ. అగణిత=ఎన్నరాని, సత్య=సత్యమును, భాష=పలుకువాఁడా, శరణాగత=శరణుజొచ్చినవారిని, పోష=పోషించువాఁడా, దయా=కరుణయనెడి, లసత్=ప్రకాశించుచున్న, ఝరీ=ప్రవాహముచేత, విగత=పోయిన, సమస్త=సకలమైన దోష=(ఆశ్రితులయొక్క) దోషములుగలవాఁడా, పృథివీసుర=బ్రాహ్మణులను, తోష=సంతోషపెట్టువాఁడా, త్రిలోక=మూఁడులోకములను, పూతకృత్=పవిత్రము చేయుచున్న, గగనధునీ=ఆకాశనదియైన గంగయనెడు, మరంద=పూఁదేనెగల, పదకంజ విశేష=చరణపద్మ విశేషముగలవాఁడా, మణి=రత్నముయొక్క, ప్రభా=కాంతులచే, ధగద్ధగిత=ధగధగమని ప్రకాశింపఁజేయఁబడిన, విభూష=ఆభరణములుగలవాఁడా, కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడా, భద్రగిరిదాశరథీ=భద్రాచలవాసుఁడైన రామా.

తా. సత్యవచనుఁడును, శరణాగతరక్షకుండును, ఆశ్రితులదోషముల దయచేత బోఁగొట్టువాఁడును, బ్రాహ్మణులను సంతోషపరచుచు, మూఁడు లోకములను పవిత్రముఁజేయు గంగపుట్టిన చరణారవిందము గలవాఁడును, రత్నములయొక్క కాంతులచే ధగధగ మెఱయుచున్న యాభరణములను ధరించిన వాఁడును, భద్రాచలవాసియునగు శ్రీరామా.

ఉ. రంగదరాతిభంగ, ఖగ ♦ రాజతురంగ, విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ, పరి ♦ తోషితరంగ, దయాంతరంగ, స

త్సంగ ధరాత్మజాహృదయ ♦ సారసభృంగ,నిశాచరాబ్జమా
తంగ, శుభాంగ, భద్రగిరి ♦ దాశరథీకరుణాపయోనిధీ. 4

టీ. రంగత్=ప్రకాశించుచున్న, అరాతి=శత్రువులను,భంగ=భజించువాఁడా, ఖగరాజ=పక్షిరాజగు గరుత్మంతుఁడనెడి, తురంగ=గుఱ్ఱము గలవాఁడా, విపత్=ఆపదయొక్క, పరంపరా=ఎడతెగనివరుసయనెడి ఉత్తుంగ=ఎత్తైన, తమః=చీఁకటికి, పతంగ=సూర్యుఁడైనవాఁడా, పరితోషిత=మిక్కిలిసంతోషపెట్టబడిన, రంగ=రంగస్వామిగలవాఁడా, దయాంతరంగ=దయగల మనస్సుగలవాఁడా, సత్+సంగ=సజ్జనులతోడి కూడిక గలవాఁడా, ధరాత్మజా=భూదేవికూతురైన సీతాదేవియొక్క, హృదయ=మనస్సు అనెడి, సారస=పద్మమునకు, భృంగ=తుమ్మెదయైనవాఁడా, నిశాచర=రాక్షసులనెడి, అబ్జ=తామరలకు, మాతంగ=ఏనుగు అయినవాఁడా, శుభాంగ=మంగళప్రదమైన అవయవములు గలవాఁడా.

తా. శత్రువుల గర్వమునడంచి, గరుడవాహనమెక్కి ఆశ్రితుల గాపాడుచు రంగనాథుని సంతోషపెట్టి, దయతోఁ గూడిన మనస్సుగలిగి, సత్పురుషులచే కొలువఁబడుచు, సీతయొక్క ప్రేమకును, ధ్యానమునకును స్థానమై దయాసముద్రుడనగు భద్రాచలరామా.

ఉ. శ్రీద సనందనాదిముని ♦ సేవిత పాద దిగంతకీర్తి సం
పాద సమస్తభూతపరి ♦ పాలవినోద విషాద వల్లికా
చ్ఛేద ధరాధనాథకుల ♦ సింధుసుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 5

టీ. శ్రీ=సంపదను,ద=ఇచ్చువాఁడా,సనందనాది=సనందనుడు మొదలయిన,ముని=ఋషులచే,సేవిత=కొలుపబడిన,పాద=చరణములుగలవాఁడా

దిగంత=దిక్కుకొనలయందలి, కీర్తియశమ్మును, సంపాద=సంపాదనముగల వాఁడా, సమస్త=సమస్తమైన, భూత=ప్రాణులయొక్క, పరిపాల=రక్షించుటయందు, వినోద=వేడుక కలవాఁడా, ధరాధినాథ=రాజులయొక్క, కుల=వంశమనెడు, సింధు=సముద్రమునకు, సుధామయ=అమృతమయము లైన పాద=కిరణములుగల చంద్రుఁడైనవాఁడా, నృత్త=నాట్యము, గీత=పాట, ఆది=మొదలైన, వినోద=వేడుకలుగలవాఁడా.

తా. ఆశ్రితులకు సంపదల నిచ్చుచు, సనకసనందనాది ఋషులును కొలుచునట్టి పాదములు గలిగి దిక్కుల ప్రసిద్ధి గాంచి, సకలప్రాణులను లీలావినోదముగ బ్రోచుచు, దుఃఖములను బోగొట్టుచు, రాజకులమునం దుద్భవించుటచే దానికి అభివృద్ధి గలిగించి నృత్తగీతాదులగు వేడుకలం దాసక్తుఁడైన దయాసముద్రుఁడగు భద్రాచలరామా.

ఉ. ఆర్యులకెల్ల మ్రొక్కి ♦ వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యులకంజలెత్తి కవి ♦ సత్తములన్ వినుతించి కార్యసౌ
కర్యమెలర్పనొక్కశత ♦ కంబొనగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. ఆర్యులకున్ + ఎల్ల=పూజ్యులగు పెద్దలందఱకిని, వినతాంగుడనై=అడకువచేత వినమ్రములైన అవయవములు గలవాఁడనై మ్రొక్కి, రఘునాథభట్టరాచార్యులకున్=రఘునాథభట్టరు అనెడి గురువునకు, అంజలెత్తి=చేయిమోడ్చి, కవిసత్తములన్=కవిశ్రేష్ఠులను, వినుతించి=కొనియాడి, కార్యసౌకర్యము=కార్యము సులభముగా చేయఁగూడుటను, ఎలర్పన్=కలుగ, ఒక్కశతకంబు=ఒకశతకమును, ఒనగూర్చి=పొందికజేసి, నేఁడు=నేటిదినము (ఇప్పుడనుట) రచింతున్=జేసెదను, ఇది=ఈశతకమును, తాత్పర్యమునన్=ఆసక్తితోడ, గ్రహింపుము=గైకొనుము.

తా. నేను వినయముతో పెద్దలకందఱికిని మ్రొక్కి, మాగురువులైన రఘునాథభట్టరువారికి నమస్కరించి, శ్రేష్ఠులను బొగడి, వారి యాశీస్సులచే నాకార్యము సుకరముగాఁగా, యిపుడు ఒక శతకమును మాత్రమే రచించుచున్నాను కరుణాసముద్రుఁడవైన రామా నా యీశతకమును బరిగ్రహింపుము.

చ. మసకొని రేఁగుబండ్లకును ♦ మౌక్తికముల్ వెలవోసినట్లు దు
ర్వ్యసనము జెంది కావ్యము దు ♦ రాత్ములకిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుక ♦ రంబుగ జేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖ ♦ రంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 7

టీ. మసకొని=ఆసపడి, రేగుబండ్లకును, మౌక్తికముల్=ముత్తెములను, వెలవోసినట్లు=ఖరీదిచ్చినట్లు, దుర్వ్యసనమునన్=చెడ్డఆసక్తిని, చెంది=పొంది, కావ్యము=కావ్యమును, దురాత్ములకున్=దుష్టులకు, ఇచ్చితిన్=అంకితముగా యిచ్చితిని, మోసము+అయ్యె=దానిచే మోసపోతిననుట, నారసనకున్=నా నాలుకకు, పూతవృత్తి=పరిశుద్ధమైన వర్తనము, సుకరంబుగన్=సులువుగా, చేకురునట్లు=కలుగునట్లు, వాక్సుధారసములు=వాక్కులనెడి యమృతరసములు, చిల్కన్=ఒలుకునట్లు, పద్యముఖరంగమునందు=పద్యములుగల నాముఖమనెడి నాట్యరంగమునందు, సంతసమును=సంతోషమును చెంది, నటింపవయ్యా=నాట్యము సేయుమా.

తా. ముత్యాలు వెలగాపోసి రేగుపండ్లకు ఆసపడినట్లు దుష్టులగువారికి కావ్యములనుచెప్పి పురుషార్థమును చెందక మోసపోతిని. వారినివర్ణించుటచే నా నాలుక మలినమైనది.

కావున దానికి సులువుగా పరిశుద్ధి గలుగునట్లు నీకంకితముగా కావ్యము సేయఁగోరెద. అప్పుడు నా నాలుకయనెడి రంగము నందు నీవు నిలిచి నటించి అమృతము లొలుకునట్టి పద్యములను జెప్పునట్లు చేయవలయును.

ఉ. శ్రీరమణీయహార యత • సీ కుసుమాభ శరీర, భక్తమం
దార, వికారదూర, పర • తత్త్వవిహార త్రిలోకచేతనో
ద్ధార, దురంతపాతక వి • తానవిదూర, ఖరాదిదైత్యకాం
తారకుఠార భద్రగిరి • దాశరథీ కరుణాపయోనిధీ. 8

టీ. శ్రీ=కాంతచేత, రమణీయ=మనోజ్ఞమైన, హార=హారముగల వాఁడా, అతసీకుసుమ=అవిసెపువ్వులవంటి, ఆభ=కాంతిగల, శరీర=దేహము గలవాఁడా, భక్తమందార=భక్తులకుకల్పవృక్షమైనవాఁడా, వికారదూర=వికారములేనివాఁడా, పరతత్త్వ=పరమాత్మరూపముయొక్క, విహార=అవతారాదివిహారములైనవాఁడా, త్రిలోక=మూఁడులోకములందలి, చేతన=జీవులను, ఉద్ధార=ఉద్ధరించువాఁడా, దురంత=అంతములేని, పాతక=పాపములయొక్క, వితాన=సమూహమునకు, విదూర=మిక్కిలిదూరమైనవాఁడా, ఖరాది=ఖరుఁడు మొదలుగాఁగల, దైత్య=రాక్షసులనెడి, కాంతార=అడవికి, కుఠార=గొడ్డలియైనవాఁడా, కరుణాపయోనిధీ, భద్రగిరిదాశరథీ.

తా. కాంతిచేత మనోజ్ఞమైన హారములుదాల్చి, అవిసెపూలవంటి మేనికాంతిగలిగి, భక్తులకోర్కెలు దీర్చుచు, నీపరతత్త్వ స్వరూపమునందు రమించుచు ముల్లోకములందలి చేతనులను రక్షించుచు సకల పాపములకు దూరుఁడవై, ఖరుఁడు మొదలగు రాక్షసులనుదునుమాడి దయాసముద్రుఁడవై యొప్పు భద్రాద్రిరామా.

చ. దురితలతాలవిత్ర, ఖర ♦ దూషణకాననవీతిహోత్ర, భూ
భరణకళావిచిత్ర, భవ ♦ బంధవిమోచన సూత్ర, చారువి
స్ఫురదరవిందనేత్ర, ఘన ♦ పుణ్యచరిత్ర, వినీలభూరికం
ధరసమగాత్ర, భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 9

టీ. దురిత=పాపమనెడి, లతా=తీఁగలకు, లవిత్ర=కొడవలియైన వాఁడా, ఖరదూషణ=ఖరుఁడు దూషణుఁడు అను, కానన=అడవికి, వీతిహోత్ర=అగ్నియైనవాఁడా, భూ=భూమియొక్క, భరణ=భరించుటయు, కళా=విజ్ఞానముచేత, విచిత్ర=విచిత్రుఁడైనవాఁడా, భవ=పుట్టుకయనెడి, బంధ=గుడిని, వి.మోచన=విడిచిపుచ్చుటయు, సూత్రి=విధిగలవాఁడా, చారు=సుందరమైన, విస్ఫురత్=మిక్కిలిప్రకాశించుచున్న, అరవింద=తామరలవంటి, నేత్ర=నేత్రములుగలవాఁడా, ఘన=మిక్కిలియు, పుణ్య=పవిత్రమైన, చరిత్ర=చరిత్రముగలవాఁడా, వినీల=మిక్కిలిచల్లనైన, భూరి=అధికమైన, కంధర=మబ్బుతోడ, సమ=సమానమైన, గాత్ర=దేహముగలవాఁడా భద్రగిరీ!

తా. తీఁగలనెడి పాపములను కొడవలివలె ద్రుంచుచు అగ్ని అడవినివలె ఖర దూషణులను నాశనముచేసి, నానావిధ లీలలచే భూమిని భరించుచు జన్మపరంపరలను దూలించుచు తామరవంటి సొగసైన కన్నులుగలిగి, మిక్కిలి పావనమైన చరిత్రమునఁ బవిత్రిల్లి నల్లని మబ్బువంటిశరీరమునుదాల్చి కరుణాసముద్రుఁడనైన భద్రాచలరామా.

చ. కనకవిశాలచేల భవ ♦ కానన శాతకుఠారధార స
జ్జనపరిపాలశీల దివి ♦ జస్తుత సద్గుణకాండ కాండ సం
జనిత పరాక్రమక్రమ వి ♦ శాదర శారదకందకుంద చం
దనఘనసార సార యశ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 10

టీ. కనక=బంగారమయమును, విశాల=విరివిగ్గానదియు నగు, చేల=వస్త్రములుగలవాఁడా, భవ=పుట్టుకయనెడి, కానన=అడవికి, శాత=వాడియైన, కుఠార=గొడ్డలియొక్క, ధార=వాదరయైనవాఁడా, సజ్జన=సత్పురుషులను, పరిపాల=రక్షించుటయే, శీల=స్వభావముగాఁగలవాఁడా, దివిజ=దేవతలచేత, స్తుత=స్తోత్రము చేయఁబడిన, సద్గుణ=మంచిగుణములయొక్క, కాండ=సమూహముగలవాఁడా, కాండసంజనిత=నీటియందుపుట్టిన అగ్నియొక్క, పరాక్రమ=శౌర్యము యొక్క, క్రమ=విధమునందు, విశారద=శరత్కాలసంబంధమైన, కంద=మేఘము, కుంద=మొల్లలు, చందన=చందనము, ఘనసార=పచ్చకర్పూరము, సార=శ్రేష్ఠమైన, యశః=కీర్తిగలవాఁడా, కరుణాపయోనిధీ.

తా. విరివియైన బంగారువస్త్రముగట్టి పదును గొడ్డలిచే అడవిని నరుకునట్లు జన్మ పరంపరను నాశనముచేసి, సత్పురుషులను రక్షించుచు దేవతలు పొగడునట్టి గుణగణములచే రాణించి, అగ్నివంటి పరాక్రమము శరత్కాల మేఘమువంటి చందనము పచ్చకప్పురమువంటి కీర్తిగలిగినరామా.

ఉ. శ్రీరఘువంశతోయధిక ♦ శీతమయూఖుఁడవైన నీపవి
త్రోరుపదాబ్జముల్ వికసి ♦ తోత్పల చంపకవృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁ ♦ బూజలొనర్చెదఁ జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 11

టీ. శ్రీ=సంపత్కరమైన, రఘువంశ=రఘురాజువంశమనెడి, తోయధికిన్=సముద్రమునకు, శీతమయూఖుఁడవు=చంద్రుఁడవు, ఐన=ఐనట్టి, నీ=నీయొక్క, పవిత్ర=పావనములును, ఉరు=గొప్పవియు, శ్రేష్ఠపదాబ్జముల్=తామరలవంటి యడుగులును, వికసిత=ప్రకాశించిన, ఉత్పల=ఉత్పలమాలికలనెడి, వృత్త=ఛందోవృత్తములయొక్క, మాధురీ=తీయదనముచేత, పూరి

త=నిండింపబడిన, వాక్=వాక్కులనెడి, వికసిత=వికసించిన, ఉత్పల=నల్లగలువలయు,చంపక=సంపెంగలయు, వృత్త=వృత్తమునగలవియు,మాధురీ=మకరందముచేత, పూరిత=నిండినవియునగు, ప్రసూనములన్=పువ్వుల చే పూజలు, ఒనర్చెదను=చేసెదను, తారక=సంసారమును తరింపజేయునట్టి, నామ=దివ్యనామముగలవాఁడా, చిత్తగింపుమీ=అంగీకరింపుమా.

తా. చంద్రుఁడు తాను పుట్టిన సముద్రమును వర్ధిల్లజేయునట్లు, రఘువంశమునంబుట్టి దానిని వృద్ధిచేయువాఁడవగు నీపాదారవిందవములను ఉత్పల చంపకమాలికావృత్తములందలి వాక్కులనెడి ఉత్పలచంపక పుష్పములచేతఁ బూజింపుచున్నాను కైకొనుమా.

చ. గురుతరమైన కావ్యరస ♦ గుంభనకబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిల ♦ జాలుదురోటుశశాంకచంద్రికాం
కురముల కిందుకాంతమణి ♦ కోటిస్రవించినభంగి వింధ్యభూ
ధరమున జాలునే శిలలు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 12

టీ. గురుతరము=మిక్కిలిగొప్పదైన, కావ్య=కావ్యమునంగలి, రస=శృంగారాది రసములయొక్క, గుంభనకున్=కూర్పునకు, ముష్కరుల్=రసజ్ఞతలేనిమూఢులు, సరసులమాడ్కి=రసికులవలె, అబ్బురమంది=ఆశ్చర్యమునుపొంది, సంతసిలన్=సంతోషించుటకు,చాలుదురోటు=శక్తులగుదురా! శశాంక=చంద్రునియొక్క, చంద్రిక=వెన్నెలలయొక్క, అంకురములకున్=మొలకలకు, ఇందుకాంతమణి=చంద్రకాంతమణుల, కోటి=సమూహము, స్రవించినభంగిన్=కఱగినరీతిని, వింధ్యభూధరమున=వింధ్యపర్వతమునందు, శిలలు=ఱాలు, జాలునే=కఱగునా.

తా. చంద్రకాంతమణులు చంద్రుని కిరణములకు కఱగునట్లు వింధ్యపర్వతపు శిలలు కఱిగి, స్రవింపజాలవు. ఇట్లే

గొప్పకార్యమునందలి, రసస్ఫూర్తికి రసికులవలె మూఢులు మెచ్చి సంతోషింపజాలరు. కావున నాకావ్యమును సరసుఁడ వయిన నీకు అంకితము సేయుచున్నాను.

చ. తరణికులేశ నానుడులఁ ♦ దప్పులు గల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము ప ♦ విత్రముగాదె వియన్నదీజలం
బరగుచు వంకయైన మలి ♦ నాకృతిఁ బాఱినఁ దన్మహత్వముం
దరమె గణింపనెవ్వరికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 13

టీ. తరణికులేశ=సూర్యవంశమునందు, జనించినవారిలో శ్రేష్ఠుఁడైనవాఁడా, నానుడులన్=నామాటయందు, తప్పులు=దోషములు, కలిగినన్=కలిగినప్పటికిని, నీదు=నీయొక్క, నామ=పేరుతోడ, సత్=శ్రేష్ఠమైనదియు, విరచిత=రచియింపబడినదియు, ఐనకావ్యము=అయినట్టికావ్యము, పవిత్రము కాదె=పావనమేయగును కాదా, వియన్నదీజలంబు=ఆకాశగంగయొక్క నీరు, అరుగుచున్=ప్రవహించుచు, వంకయైన=వంకరగానయినను, మలిన+ఆకృతిన్=మురికిగలఆకారముతో, పాఱినన్=ప్రవహించినను, తన్మహత్వమున్=దానిమహత్వమును, గణింపన్=ఎన్నుటకు, తరమె=శక్యమా.

తా. సూర్యవంశమున జనించినవారిలో శ్రేష్ఠుఁడైన వాఁడా! నామాటలయందు దోషము లెన్నియున్నను, నీయొక్క నామముతోడ శ్రేష్ఠమయినదియు రచియింపఁబడినదియు, కావ్యము పవిత్రమయినదికాదా? (అగుననుట) అనగా ఆకాశ గంగయొక్క నీరు ప్రవహించుచు, వంకరగాపాఱినను మురికి గల ఆకారముతో ప్రవహించినను దానిమాహాత్మ్యము ఎనుటకు శక్యమా. (కాదనుట.)

ఉ. దారుణపాతకాబ్ధికి స ♦ దా బడబాగ్ని భవాకులార్తి వి
స్తారదవానలార్చికి సు ♦ ధారసవృష్టి దురంత దుర్మతా
చారభయంకరాటవికిఁ ♦ జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 14

టీ. నీతారకనామము=సంసారమును, తరింపజేయునట్టి నీయొక్క రామనామము, ఎన్నుకొనన్=తలంపగా, దారుణ=భయంకరమయిన, పాతక=పాపములనెడి, అబ్ధికిన్=సముద్రమునకు, సదా=ఎల్లప్పుడు, బడబాగ్ని=బడబాగ్నియైనది, భవ=సంసారముయొక్క, ఆకుల=వ్యాప్తమైయున్న, ఆర్తి=పీడయొక్క, విస్తార=బాహుళ్యమనెడి, దవానల=కారుచిచ్చుయొక్క, అర్చికిన్=సేపకు, సుధారసవృష్టి=అమృతద్రవవర్షము, దురంత=మితిమీఱిన, దుర్మతి=దుష్టమతములయొక్క, ఆచార=ఆచారములనెడి, భయంకర=భయంకరమును గలిగించునట్టి, అడవికిన్=అడవికి, చండ=తీక్ష్ణమును, కఠోర=కటుకయినదియునగు, కుఠార=గొడ్డలియొక్క, ధార=మొనవంటిది.

తా. సంసారతారకమయిన నీరామనామము బడబాగ్ని సముద్రమును పీల్చునట్లు భయంకరములైన పాతకములను బోగొట్టును. అమృతద్రవవర్షము కాఱుచిచ్చును చల్లార్చునట్లు సంసార బాధలను ఉపశమింపఁజేయును. పదునయిన గొడ్డలిచే భయంకరమైన అడవిని నఱుకునట్లు మితిమీఱిన దుర్మతాచారములను నిర్మూలము చేయును.

చ. హరునకు నవ్విభీషణున ♦ కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి సహాయకుం ద్రుపద ♦ కన్యకునార్తిహరించు చుట్టమై
పరగినయట్టి నీపతిత ♦ పావననామము జిహ్వపై నిరం
తరము నటింపజేయుమికఁ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 15

టీ. హరునకున్=శివునకును, అవ్విభీషణునకున్=ఆ విభీషణునికిని, అద్రిజకున్=పార్వతికిని, తిరు=శ్రీకరమైన, మంత్రరాజము=శ్రేష్ఠమైన మంత్రముఅయి, కరికిన్=ఏనుగునకును, అహల్యకున్=అహల్యకును, ద్రుపదకన్యకున్=ద్రౌపదికిని, ఆర్తిన్=మనోవ్యధను, హరించుచుట్టము=పోగొట్టునట్టి బంధువు అయి, పరగినయట్టి=ప్రసిద్ధిగాంచినట్టి, నీ=నీయొక్క, పతిత=పతితులయినవారికి, పావన=పరిశుద్ధులను జేయునట్టి, నామము=పేరు, జిహ్వపైన్=నాలుకమీద, నిరంతరము ఎడతెగక, నటింపజేయుము=నృత్యముచేయునట్లు చేయుమా.

తా. దశరథరామా! శివునకు విభీషణునకు పార్వతికిని శ్రేష్ఠమైన మంత్రమై, గజేంద్రునకు అహల్యకును, ద్రౌపదికిని చుట్టమువలె చిక్కులను దొలగించినదై, పాపులను పవిత్రుల నొనరించునట్టి నీనామమును నా నాలుకయందు నటించునట్లు చేయుమా.

ఉ. ముప్పున గాలకింకరులు ♦ ముంగిటవచ్చిన వేళ, రోగముల్
గొప్పరమైనచో, గఫము ♦ కుత్తుక నిండినవేళ, బాంధవుల్
గప్పినవేళ, మీస్మరణ ♦ గల్గునొ గల్గదొ నాటి కిప్పుడే
తప్పక చేతు మీభజన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 16

టీ. ముప్పునన్=ముసలితనమందు, కాలకింకరులు=యమదూతలు, ముంగిటన్=ఇంటిముంగిటికి, వచ్చినవేళన్=వచ్చినట్టిసమయమునను, రోగముల్=తెవుళ్ళు, కొప్పరము=అతిశయించినవి, అయినచోన్=అయినప్పుడును, కఫము, కుత్తుకన్=కంఠమునందు, నిండినవేళన్=పూర్ణమయిన సమయమునందును, బాంధవుల్=చుట్టములు, కప్పినవేళన్=క్రమ్ముకొన్నప్పుడును, మీస్మరణ=మిమ్మును స్మరించుట, నాటికిన్=అప్పటికిని, కల్గునో కల్గదో, యేమొ ఇప్పుడే, తప్పక=విడువక, మీభజన=మిమ్ము భజించుట, చేతున్=చేయుదును.

తా. శ్రీరామా ! ముసలితనమునచ్చి నేనున్న చోటికి యమదూతలు వచ్చినప్పుడు, రోగములు మిక్కిలి ముమ్మర మైనప్పుడును, మరణము సమీపింపఁగా కఫము గొంతుకయం దు నిండియున్న పుడును, అప్పుడు చుట్టములు చుట్టును క్రమ్ము కొనియుండగాను మిమ్ము స్మరించుట నాకు కలుగునో కలుగదో చెప్పజాలను, కనుక ఇప్పుడే తప్పక నిన్ను భజనచేసెదను.

చ. పరమదయానిధే పతిత ♦ పావననామ హరేయటంచు సు
స్థిరమతులై సదాభజన ♦ సేయుమహాత్ములపాదధూళి నా
శిరమునదాల్తుమీరటకు ♦ జేరకుడంచు యముండుకింకరో
త్కరముల కాన బెట్టునఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. పరమ=మిక్కిలియైన,దయా=కృపకు,నిధీ=నిదానమైనవాఁడా, పతిత=పాపాత్ములను, పావన=పవిత్రులనుగాజేయునట్టి, నామ=పేరుగల వాఁడా, హరే=శ్రీహరీ, అటంచున్=అని, సదా=ఎల్లప్పుడును, సుస్థిర=మిక్కిలినిలకడగల, మతులు=మనస్సుగలవారు, ఐ=అయి, భజన=భజిం చుట, చేయుమహాత్ముల=చేయునట్టి మహనీయులయొక్క, పాదధూళి= అడుగులదుమ్ము, నాశిరమునన్=నాతలయందు, తాల్తున్=ధరింతును, మీరు అటకున్=వారికడకు, జేరకుఁడు=పోవకుఁడు, అంచున్=అనుచు, యము డు=యముఁడు, కింకరోత్కరములకున్=తన సేవకుల సమూహములకు, ఆన బెట్టునట=ఒట్టు పెట్టునని చెప్పుదురు.

తా. పాపాత్ములను పవిత్రులనుగ జేయునట్టి పేరుగల వాఁడా ! హరీయని యెప్పుడును మిక్కిలి నిలకడగల మనస్సు గల వారయి భజించునట్టి మహానీయులయొక్క పాదధూళి

నాతలయందు ధరింతును. మీరు వారికడకు పోవకుఁడనుచు యముఁడు తనసేనకసముదాయములకు ఒట్టుబెట్టునని చెప్పుదురు.

చ. అజునకుదండ్రివయ్యు సన ♦ కాదులకుం బరతత్త్వమయ్యు స
ద్ద్విజమునికోటికెల్లఁబర ♦ దేవతవయ్యు దినేశవంశ భూ
భుజులకుమేటివయ్యు బరి ♦ పూర్ణుఁడవై వెలుగొందుపక్షిరా
డ్ధ్వజ మిము బ్రస్తుతించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. అజునకున్=బ్రహ్మకు, తండ్రివయ్యు=తండ్రివిగాన, సనకాదులకున్=పరతత్త్వవేత్తలైన సనకుఁడు సనందనుఁడు మొదలయినవారికి, పరతత్త్వము అయ్యున్=ఉత్కృష్టవస్తువు గాను, సత్=శ్రేష్ఠులయిన, ద్విజ=బ్రాహ్మణులయొక్క, ముని=ఋషులయొక్క, కోటికిన్ ఎల్లన్=సమూహమునకు, పరదేవతవు అయ్యున్=శ్రేష్ఠమైన దైవముగాను, దినేశ=సూర్యునియొక్క, వంశ=కులమందలి, భూభుజులకున్=రాజులకు, మేటివయ్యున్=శ్రేష్ఠుడవుగాను, పరిపూర్ణుడవు=నిండినవాఁడవు, ఐ=అయి, వెలుంగు=ప్రకాశించుచున్న, పక్షిరాడ్ధ్వజ=పక్షులకెల్లరాజైన గరుత్మంతుండు, వాహనముగాగలవాఁడా, మిమ్మున్=మిమ్ము, ప్రస్తుతించెదను=మిక్కిలి స్తోత్రము చేసెదను.

తా. బ్రహ్మకు తండ్రివిగాను, సనకసనందనాది మహర్షులు ధ్యానముసేయు పరతత్త్వముగాను, విప్రముని సమూహములు కొలుచునట్టి పరదైవముగాను, ఇట్లు అన్నిలక్షణములును పరిపూర్తి నొందినవాఁడవై గరుడుఁడు ధ్వజముగాఁగలిగి ప్రకాశించు దయానిధీ! నిన్ను మిక్కిలి ప్రస్తుతించెదను.

ఉ. “పండితరక్షకుం డఖిల ♦ పాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశ ♦ కంఠవిలుంఠన చండకాండ కో

దండకళా ప్రవీణుఁ” డను ♦ తావకకీర్తి వధూటికిత్తు బూ
దండలు గాఁగ నాకవిత ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 19

టీ. పండితరక్షకుండు=పండితులను రక్షించువాఁడు, అఖిలపాప=సమస్తపాపములను, విమోచనుఁడు=విడిచిపుచ్చువాఁడు, అబ్జసంభవ=బ్రహ్మచేతను, ఆఖండల=ఇంద్రునిచేతను, పూజితుండు=పూజింపబడువాడు, దశకంఠ=రావణాసురుని పదితలలను, విలుంఠన=కొల్లగొనుటచేత, చండ=తీక్ష్ణమయిన, కాండ=బాణములుగల, కోదండకళా=విలువిద్యయందు, ప్రవీణుడు=నేర్పరియైనవాఁడు, అను=అనెడి, తావక=నీయొక్క, కీర్తి=యశస్సు అనెడి, వధూటికిన్=స్త్రీకి, నాకవిత=నాకవిత్వమును, పూదండలు కాఁగ=పూలసరములు అయినట్లుగా, ఇత్తున్=ఇత్తును.

తా. “కరుణాసముద్రుఁడవయిన రామా! పండితులను రక్షించువాఁడు, సమస్తపాపములను దొలగించువాఁడు, బ్రహ్మేంద్రాదులచే పూజింపఁబడువాఁడు, రావణాసురుని తలలు దునుమునట్టి వాడిబాణములను వేయనేర్చిన విలువిద్యల యందు నేర్పరియైనవాఁడు” అనెడు నీ కీర్తికి నాకవిత్వమును ఇచ్చి ఒకపడతికి పూదండలిచ్చి యలంకరింపజేసినట్లు నీ కీర్తి కాంతను శోభిల్లజేయుదును.

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజ ♦ సేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ విర ♦ జానది గౌతమిగాఁ వికుంఠము
న్నారయఁ భద్రశైలశిఖ ♦ గాగ్రముగాఁగవసించు చేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 20

టీ. శ్రీరమ=లక్ష్మీదేవి, సీతకాఁగన్=సీతాదేవికాఁగా, నిజ=తనదైన, సేవకబృందము=పరిజనుల సమూహము, వీరవైష్ణవ, ఆచార=ఆచార

ముగల, జనంబులుకాఁగన్=జనుకాగా, విరజానది, గౌతమికాఁగన్=గోదావరికాగా, వికుంఠమున్=వైకుంఠమును, అరయన్=విచారింపగా, భద్రశైల=భద్రాచలముయొక్క, శిఖర=శిఖరముయొక్క, అగ్రముగాఁగన్=కొనకాగా, వసించి=నెలకొని, చేతనోద్ధారకుఁడు=చేతనుల నుద్ధరించువాఁడు, ఐనవిష్ణుఁడవు=అయినట్టి సాక్షాద్విష్ణుదేవుఁడవు.

తా. దశరథరామా ! నీవు పరమపదమందున్న లక్ష్మీదేవిని ఇచట సీతగాఁజేసికొని అందలి పరివారము ఇచట వీరవైష్ణవజనులుగా వచ్చి కొలుచుచుండగా అచ్చట విరజానది ఇచట గోదావరిగా ప్రవహింపగా, ఆ వైకుంఠమే యిచ్చట భద్రగిరి కొమ్ముకొనయై రాణింపగా వేంచేసి చేతనులను ఉద్ధరించుచున్న శ్రీవిష్ణుదేవుండవే కాని వేఱుగావు.

ఉ. కంటి నదీతటంబుఁ బొడ ♦ గంటిని భద్రనగాధి వాసముం
గంటి నిలాతనూజ నురు ♦ కార్ముక మార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ములక్ష్మణుని ♦ గంటి కృతార్థుఁడనైతినో జగ
త్కంటక దైత్యనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 21

టీ. జగత్=లోకములకు, కంటక=హింసించువారైన, దైత్య=రాక్షసులను, నిర్దళన=సంహరించువాఁడా, కరుణాపయోనిధీ దాశరథీ, నదీతటంబు=నదియొక్కతీరమును, కంటిన్=చూచితిని, భద్రనగాధివాసమున్=భద్రాచలమనెడి నివాసస్థానమును, కంటిన్=చూచితిని, ఇలాతనూజన్=భూదేవికూతురయిన సీతాదేవిని, కంటిన్=చూచితిని, ఉరు=గొప్పదైన, కార్ముక=విల్లు, మార్గణ=బాణములు, శంకచక్రముల్=శంఖమును చక్రమును, కంటిన్=చూచితిని, కృతార్థుఁడను=ధన్యుఁడను, ఐతిన్=అయితిని,

తా. లోకహింసకులైన రాక్షసులను రూపుమాపి, దయాసముద్రుఁడవైయొప్పు శ్రీరామా! నీవు వేంచేసియున్న భద్రగిరియొద్దనున్న గోదావరిగట్టును, నీవు వేంచేసియున్న భద్రాచలవాసము, సీతాదేవిని, నీవిల్లును, బాణములను, శంఖ చక్రములను నిన్నును లక్ష్మణుని సేవించి కృతార్థుఁడనైతి.

చ. హలికునకున్ హలాగ్రమున ♦ నర్థము సేకురుభంగిదప్పిచే
నలమటఁజెందువానికి సు ♦ రాపగలో జలమబ్బినట్లు దు
ర్మలినమనోవికారినగు ♦ మర్త్యునినన్నొడఁగూర్చి నీపయిం
దలఁపు ఘటింపఁజేసితివి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 22

టీ. దాశరథీ, హలికునకున్=మడఁకదున్నువానికి, హలాగ్రమునన్=నాగలిమొనయందు, అర్థము=ధనము, జేకురుభంగిన్=లభించినవిధమున, దప్పిచేన్=దాహముచేత, అలమటన్=బడలికను, చెందువానికి=పొందువానికి, సురాపగలోనన్=గంగలో, జలము=నీరు, అబ్బినట్లు=దొరకినవిధమున, దుర్మలిన=మిక్కిలి దోషయుక్తమైన, మనః=మనస్సుయొక్క, వికారిని=వికారముగలవాఁడను, అగుమర్త్యునిన్=అయిన మనుష్యుని నన్ను, ఒడగూర్చి=సవరించి, నీపయిన్=నీమీఁద, తలఁపు=చింతనము, ఘటింపజేసితివి=కలుగఁజేసితివి.

తా. మడఁక దున్నుకొను బీదకు మడఁక మొంగల భూమిలో ధనముదొరకినట్లును, దప్పికొని బడలినవానికి గంగానదిలోని నీరు లభించినట్లును, దుష్టమనస్సుగల మనుష్యుఁడైన నన్ను చక్కఁజేసి నీపయి తలఁపు గలిగించి ధన్యుని చేసితివి.

ఉ. కొంజక తర్కవాదమను♦ గుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్
రంజిలఁ ద్రవ్వి కన్గొనని ♦ రామ నిధానము నేఁడుభక్తి సి
ద్ధాంజనమందు హస్తగత ♦ మయ్యెబళీయనఁగా మదీయహృ
త్కంజమునన్ వసింపుఁమిక ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. కొంజక=సంకోచింపక, తర్కవాదము=తర్కము చేయుట వివాదము అను గుద్దలిచేత, పరతత్త్వభూస్థలిన్=పరతత్త్వమనెడి భూప్రదేశమును, రంజిలన్=ఒప్పగా, త్రవ్వి=కన్గొనని, రామనిధానము=చూడలేని రాముఁడు అనెడినిధి, నేఁడు=ఇపుఁడు, భక్తిసిద్ధాంజనమందు=భక్తియనెడి సిద్ధకృతమైన కాటుకయందు, హస్తగతము=చేతికిదొరికినది, అయ్యెన్=అయెను, అనగాన్=అనునట్లు, ఇకన్=ఇకమీద, భక్తిచేత, మదీయహృత్కంజమునన్=నాహృదయకమలమందు, వసింపుము=నెలకొనుము.

తా. భూమిని గుద్దలిచే త్రవ్వినను కనఁబడని నిధి అంజనముచే లభించునట్లు, పరతత్త్వతర్కవాదములచే ఎంతపరిశీలించినను అంతు తెలియరాని రాముఁడవగు నీవు భక్తిచే సులభముగా నాకు వశమైతివి. ఇఁక నాహృదయమునందువసింపుము.

ఉ. రాముడు ఘోరపాతక వి ♦ రాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయ ♦ రాముఁడుసాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముడేపరమ♦దైవముమాకనిమీఁయుడుఁగుగెం
వామరలే భజించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 24

టీ. రాముఁడు=రమింపజేయువాఁడు, ఘోర=భయంకరములైన, పాతక=పాతకములను, విరాముఁడు=తొలగించువాఁడు, సద్గుణ=మంచిగుణములు అనెడి, కల్పవల్లికా=కల్పవృక్షపుతీగలకు, ఆరాముఁడు=తోటయైన

వాఁడు, షడ్వికార=పుట్టుట పెరుగుట మొదలయిన ఆఱువికారములయొక్క, జయ=గెలుపుచేత, రాముఁడు=మనోజ్ఞుఁడయినవాఁడు, సాధుజన=సజ్జనులను, అవన=రక్షించుట అనెడి, వ్రత=నియమము చేత, ఉద్దాముఁడు=అధికుఁడయినవాఁడు, శ్రీరాముఁడే=శ్రీరాముఁడే, మాకు పరదైవమని, మీఅడుంగు కెందామరలను=మీపాదములనెడి ఎఱ్ఱతామరలను, ఏను=నేను, భజించెదను=కొలిచెదను.

తా. సకల జనులను రమింపఁజేయువాఁడును, ఘోరమయిన పాపములను తొలఁగించువాఁడును, కల్యాణగుణములను అవ్వారిగాఁ గలవాఁడును, వికారరహితుఁడై ప్రకాశించువాఁడును, సాధుజనులను రక్షించునట్టి వాఁడును, రాముఁడే మాకు పరదైవమని మీ పాదారవిందములను కొలిచెదను.

ఉ. చక్కెరమాని వేముదినఁ • జాలినకైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల • వేమరుగొల్చెద రట్లకాదయా
మ్రొక్కిన నీక మ్రొక్కవలె•మోక్షమొసంగిన నీవయీవలెం
దక్కినమాటలేమిటికి • దాశరథీ కరుణాపయోనిధీ. 25

టీ. చక్కెరన్=పంచదారను, మాని=విడిచి, వేమున్=వేపచెట్టును, చేదునుతినన్=తినుటకును, చాలినకైవడిన్=నేర్చినవిధమున, మానవాధముల్=హీనులు, పెక్కుఱు=అనేకులు, బక్కదైవమున్=అల్పదేవతలను, వేమఱున్=పలుమాఱు, కొల్చెదరు=సేవించెదరు, అట్ల=ఆవిధమే, కాదయా=కాదు, మ్రొక్కినన్=మ్రొక్కినయెడల, నీక=నీకే, మ్రొక్కవలెన్=నమస్కరింపవలెను, మోక్షము=ముక్తిని, ఒసఁగినన్=ఇచ్చినను, నీవ=నీవే, ఈవలెన్=యియ్యవలెను, తక్కినమాటలు=ఇతర విషయములు, ఏమిటికిఁ=ఎందుకు.

తా. హీనులైనవారు అనేకులు నిన్నువదలి దేవత లనే కములను గొలిచెదరు. అనగా తియ్యని చక్కెరను విడిచి చేఁదైన వేమును దినుటకు నేర్చినట్లున్నది. ఇది సరికాదు మ్రొక్కఁదగినవాఁడవు నీవే, మోక్షమునిచ్చువాఁడవును నీవే.

ఉ. 'రా'కలుషంబులెల్ల బయి ♦ లంబడఁద్రోచిన'మా'కవాటమై
దీకొని ప్రోచు నిక్కమని ♦ ధీయుతులెన్నఁదదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ ♦ గానరు గాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 26

టీ. 'రా'=రామఅనెడి పేరునందలి రేఫము, కలుషంబులెల్లన్=దోషములన్నిటిని, బయల్=వెలుపల, పడన్ త్రోయఁగాన్=పడునట్లుత్రోసి వుచ్చగా, 'మా'='మ' అను అక్షరము, కవాటమై=తలుపై, దీకొని=తాఁకి, ప్రోచున్=కాపాడును, నిక్కము=ఇదినిజము, అని ధీ=బుద్ధితోఁడ, యుతులు=కూడినవారు ఎన్నన్=తలఁపగా, తదీయవర్ణముల్=ఆయక్షరములను, కైకొని, చేకొని=గ్రహించి, భక్తిచేన్=భక్తిపూర్వకముగా, నుడువన్=చెప్పుటకు, కానరు=తెలియరు, కాక=కానిచో, విపత్=ఆపద యొక్క, పరంపరల్=ఎడతెగని రుసలు, జగత్+జనులన్=జగమునందలి వారిని, పైకొనునే=అక్రమించునా.

తా. "రామ" అను దివ్యనామములోని రేఫము పాపముల నన్నిటిని బయటికి తఱుమగా "మ" అనెడి అక్షరము తలుపువలె అడ్డుపడి వానిని ఎదిరించి లోపలికి రాకుండునట్లు చేసి ఆశ్రితులను కాపాడును. ఇది నిజమని జ్ఞానవంతులు చెప్పగా మూఢు లాయక్షరములను గ్రహించి జపింపనేరకున్నారు.

ఇట్లుకాక, లోకులు వానిని జంపించిరేని యెడతెగకవచ్చు ఆప
దలు వారికి కలుగవు

ఉ. రామహరే కకుత్స్థకుల ♦ రామహరే రఘురామరామ శ్రీ
రామ హరేయటంచు మది ♦ రంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జ ♦ నంబు భవంబెడబాసితత్పరం
ధామ నివాసులౌదురఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ 27

టీ. రామ=రామా,హరే=హరీ, కకుత్స్థకులరామ=కాకుత్స్థవంశము నపుట్టినరామా, హరే=హరీ, రఘురామ=రఘురాజసంతతివాఁడవైనరామా, రామ=రామా, శ్రీరామ=శ్రీరామ, హరే=హరీ, అటంచున్=అని, మది=మనస్సు,రంజిలన్=రంజిల్లునట్లు, భేక=కప్పయొక్క, కలంబులీలన్=గొంతు విధమున, స్మరించినజనంబు=మనస్సులోతలంచిన జనులు, భవంబు=జన్మములు ఎడబాసి=విడిచి, తత్=అప్రసిద్ధమైన, పరంధామ=శ్రేష్ఠమైనపట్టు, అగు పరమపదమునందు, నివాసులు=నివసించువారు, ఔదురఁట=అగుదురు.

తా. రామా! హరే! కకుత్స్థకులరామా! రఘు
రామ! శ్రీరామ! హరే! అని నీనామమును కప్పగొంతువలె
మనస్సున మాటిమాటికిఁ దలంచు జనులు ఇఁక జన్మమెత్తు
టను విడిచి పరమపదమందు వసింతురుగదా.

ఉ. చక్కెరలప్పకున్ మిగుల ♦ జవ్వని కెంజిగురాకు మోవికిం
జొక్కపుజుంటి తేనియకుఁ ♦ జొక్కులుచుంగనలేరుగాక నేఁ
డక్కటరామనామమధు ♦ రామృతమానుటకంటెసౌఖ్యమా
తక్కినమాధురీ మహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 28

టీ. చక్కెరలప్పకున్=పంచదారయొక్క రాశికిని, జవ్వని=యౌవనముగల స్త్రీయొక్క, కెంపు+చిగురాకు మోవికిన్=ఎఱ్ఱనిచిగురువంటి అధరమునకును, చొక్కపుజుంటితేనియకున్=అచ్చమైన జుంటీగలుగూర్చిన తేనెకును, మిగులన్=మిక్కిలి, చొక్కిలుచున్=చొక్కుచు, కనలేరుగాక=తెలిసికొనలేరుగాని, అక్కటా! రామనామ=రామ అనెడి నామముయొక్క, మధుర=తీయనైన, అమృతము, ఆనుటకంటెన్=ఆస్వాదించుటకంటెను, తక్కిన=ఇతరమైన, మాధురీ=తీపియొక్క, మహిమ=పేరిమి, సౌఖ్యమా=సుఖమైనదా.

తా. రామ! చచ్చెరరాశికిని, ఎలప్రాయగల స్త్రీల చిగురాకువంటి యెఱ్ఱని పెదవికిని, తేనెటీఁగలు గూర్చిన అచ్చతేనెకును చొక్కి, రామనామముయొక్క మాధుర్యమును తెలిసికొనక జనులున్నారుగాని అమృతమువలె అతిభోగ్యమైన రామనామమును ఆస్వాదించుట కంటెను తక్కినవాని మాధుర్యాతిశయము సుఖప్రదము కానేరదు. రామనామమే అన్నిటి కంటెను మధురమయినది.

ఉ. అండజవాహనిన్ను హృద ♦ యంబుననమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెసఁ ♦ గూలి నశింపకయున్న నంతతా
ఖండలవైభవోన్నతులు ♦ గల్గకమానునె మోక్షలక్ష్మికై
దండయొసంగకున్న తుద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 29

టీ. అండజవాహ=పక్షివాహనా! నిన్నున్, హృదయంబునన్=మనస్సునందున, నమ్మినవారిపాపముల్=నమ్మినట్టివారలయొక్క పాపములు, కొండలవంటి=కొండలవలె మిక్కిలిగొప్పరానులయినవి, ఐనన్=అయినను, వెసన్=త్వరితముగా, కూలి=క్రిందపడి, నశింపకయున్న=చెడిపోవక

యుండునా, సంతత=యెడతెగనట్టి, అఖండల=ఇంద్రునియొక్క, వైభవ=విభవముయొక్క, ఉన్నతులు=అతిశయములు, కల్గకమానునె=లభింపక పోవునా, తుదన్=కడపట, మోక్షలక్ష్మి=ముక్తిరూపమైనలక్ష్మి, కైదండ=సాహాయ్యము, ఒసంగకయున్నె=ఇయ్యకుండునా.

తా. పక్షివాహనా! మనస్సునందు నిన్ను నమ్మినవారికి మొదట కొండలవలె పెద్దకుప్పలుగానున్న వారి పాపములు నశించిపోవక మానవు. ఇంద్రుని యైశ్వర్యమువంటి మహదైశ్వర్యము కలుగకపోదు. పిమ్మట మోక్షము లభింపకపోదు.

చ. చిక్కనిపాలపై మిసిమి ♦ జెందినమీఁగడ పంచదారతో
మెక్కినభంగి మీవిమల ♦ మేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్లెరంబున స ♦ మాహితదాస్య మనేటిదోయిటన్
దక్కెనటంచు జుర్రెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 30

టీ. చిక్కనిపాలపై=చిక్కనగుపాలమీద, మిసిమిజెందినమీగడన్ మిసిమిని=కాంతిని, చెందిన=పొందిన, మీగడన్=మీగడను, పంచదారతో=చక్కరతోడగూర్చి, మెక్కినభంగిన్=తిన్నవిధమున, మీ=మీయొక్క, విమల=అచ్ఛమయిన, మేచక=నల్లని, రూప=ఆకారమనెడి, సుధారసంబు=అమృతరసము, నా=నాయొక్క, మక్కువ=ప్రేమ అనెడి, పళ్ళెరంబునన్=భోజనపాత్రమున, సమాహిత=హెచ్చరికగల, దాస్యము=కొలువు, అనేటి=అనునట్టి, దోయిటన్=దోసిలియందు, దక్కెను=లభించెను, అటంచున్=అనుచు, జుర్రెదను=జుఱ్ఱుచున్నాను.

తా. చిక్కనిపాలమీఁద మిసమిసలాడు మీఁగడను చక్కరతోఁగలిపి తినునట్లు మిక్కిలి అమృత రసమువలె నుండు

నీవల్లని రూపమును నేను ప్రేమతోఁగైకొని దాస్యరూపమైన కైంకర్యము అవ్వారిగాచేసి అనుభవించెదను.

చ. సిరులిడసీత, పీడలెగ ♦ జిమ్ముటకున్ హనుమంతుడార్తిసో
దరుఁడుసుమిత్రసూతిదురి♦తంబులుమానుపరామనామముం
గరుణదలిర్ప మానవులఁ ♦ గావఁగఁ బన్నిన వజ్రపంజరో
త్కరముగదాభవన్మహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ31.

టీ. సిరులు=సంపదలు, ఇడన్=ఇచ్చుటకు, సీత=సీతాదేవి, పీడలు=బాధలు, ఎగజిమ్ముటకున్=అవలీల బోగొట్టుటకు, హనుమంతుఁడు=ఆంజనేయుఁడు, అగును, ఆర్తిన్=సంకటమునందు, సోదరుడు=తోబుట్టువు, సుమిత్రసూతి=లక్ష్మణుడు, దురితంబులు=పాపములను, మానుపన్=తొలగించుటకు, రామనామము=రామ అనెడి నీనామమును, అగును, కరుణ=దయ, తలిర్పన్=మీరగా, మానవులన్=మనుష్యులను, కావగన్=కాపాడుటకు, పన్నిన=చేసిన, వజ్ర=వజ్రముచేతనైన, పంజర=గూండ్లయొక్క, ఉత్కరము=సమూహము, భవత్ + మహిమ=నీమహాత్మ్యము అగును.

తా. దశరథరామా ! సిరులిచ్చుటకు నీభార్యయయిన సీతాదేవియు, బాధలను తొలగించుటకు భృత్యుండైన హనుమంతుఁడును, సంకటములందు తోడబుట్టువువలె ఉపచరించు నీతమ్ముఁడగు లక్ష్మణుఁడును, పాపములను తొలగించుటకు నీనామమును, చిలుకల మొదలయినవానిని వజ్రపుగూండ్లలో పెట్టి కాపాడునట్లు మనుష్యులను కాపాడుటకు నీమహాత్మ్యమును గలవు.

చ. హలకులిశాంకుశధ్వజ శ ♦ రాసన శంఖరథాంగ కల్పకో
జ్జ్వలజలజాతరేఖలను ♦ సాంకములై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజ ద్వయము ♦ గౌతమపత్నికొసంగినట్లు నా
తలపునఁ జేర్చికావఁగదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 32

టీ. హల=నాఁగేలు, కులిశ=వజ్రాయుధము, అంకుశ=అంకుశము, ధ్వజ=టెక్కెమును, శరాసన=విల్లు, శంఖ=శంకువు, రథాంగ=చక్రము, కల్పక=కల్పవృక్షము, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, జలజాత=తామర, ఇవి యనెడి రేఖలను=రేఖలచేత, సాంకములు=గురుతులతోఁగూడినవి, ఐ=అయి, కనుపట్టుచున్న=అగుపడుచున్న, మీ=మీయొక్క, కలిత=ఒప్పుచున్న, పద+అంబుజ=అడుగుపద్మములయొక్క, ద్వయము=జంటను, గౌతమపత్నికిన్=గౌతముని భార్యయయిన అహల్యకు, ఒసంగినట్లు, నాతలఁపునన్=నాచింతనమందు, చేర్చి=కూర్చి, కావన్ కదె=రక్షింపుమా.

తా. అహల్యకు నాఁగేలు, వజ్రాయుధము, అంకుశము మొదలయిన వాని రూపములుగల రేఖలు దాల్చియున్న మీ పాదారవిందములను యిచ్చి ఆమెను కృతార్థురాలినిగా చేసినట్లు నాహృదయమందుచేరి నన్ను కృతార్థునిగా చేయుమా రామా.

చ. జలనిధిలోనదూఁటి కుల ♦ శైలముమీఁటి ధరిత్రిఁగొమ్మునం
దలవడమాఁటి రక్కసుని ♦ యంగముఁగీటి బలీంద్రునిన్ రసా
తలమునమాఁటి పార్థివక ♦ దంబముఁగూర్చినమేటి రామనా
తలఁపుననాటి రాఁగదవె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 33

టీ. జలనిధిలోనన్=సముద్రములోపల, దూఁటి=చొచ్చి, కులశైలమున్=కులపర్వతమును, మీఁటి=ఎగనెత్తి, ధరిత్రిన్ నీళ్ళలో మునిగియుండిన భూమిని, కొమ్మునందున్, అలవడన్=పొందికగా, మాఁటి=తగిల్చి రక్కసుని

యంగము=రాక్షసుడైన హిరణ్యకశిపుని, శరీరము, గీటి=చీల్చి, బలీంద్రునిన్=ఇంద్రుడుగానుండిన, బలిచక్రవర్తిని, రసాతలమునన్=రసాతలమందు మాటి=మఱుగుచేసి, పార్థివకదంబమున్=రాజసమూహమును, మార్చిన=నాశముచేసినట్టి, మేటి=దిట్టడవు అయిన, రామ=రామచంద్రా, నాతలపునన్=నాచింతనమందు, నాటి=నెలకొని, రాగదవే=రమ్మా.

తా. శ్రీరామా! మత్స్యమవై సోమకాసురునికొఱకు సముద్రముజొచ్చి, కూర్మమయి మందరపర్వతమును పాల సముద్రములో మునిగినదానిని యెత్తినిలిపి, వరాహమవై ప్రళయజలములలో రసాతలమునంటిన భూమిని కోఱకొమ్మున నెత్తికొనివచ్చి, నరసింహుడవై హిరణ్యకశిపుని దేహముచీల్చి, వామనుఁడవై బలిచక్రవర్తిని రసాతలమునకు అడగద్రొక్కి, పరశురాముఁడవై రాజసమూహమును సంహరించినట్టి నీవు నా మనస్సునందు దృఢముగా నిలిచియుండుమా.

ఉ. భండన భీముఁ డార్తజన ♦ బాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండ భుజ ♦ తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవమిక ♦ లేడనుచున్ గడగట్టి భేరికా
దాండదదాండదాండనిన ♦ దంబు లజాండమునిండ మత్తవే
దండము నెక్కిచాటెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 34

టీ. భండన=యుద్ధమందు, భీముఁడు=భయంకరుడు, ఆర్తజన=సంకటమునొందినవారి సమూహమునకు, బాంధవుఁడు=చుట్టము, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, బాణ=బాణములును, తూణ=పొదులునుగల, కోదండకళా=విలువిద్యయందు, ప్రచండ=తీవ్రమయిన, భుజములయొక్క, తాండవా=

నటనముచేతగలిగిన, కీర్తికిన్=యశస్సుగలవాడగు, రామమూర్తికిన్=రామచంద్రునకు, రెండవసాటిదైవము=సమానమైన మఱియొకదైవము, ఇకన్=ఇంకను, లేదు, అనుచున్, గడగట్టి=స్తంభమునాటి, భేరికా=భేరియొక్క, దాండదడాండదాండ, నినదంబులు=శబ్దములు, అజాండము=బ్రహ్మాండము, నిండన్=నిండునట్లు, మత్తవేదండము=మదించిన యేనుగును, ఎక్కి,చాటెదను=ప్రకటించెదను.

తా. రాముఁడు శత్రువులకు యుద్ధమందు భయంకరుఁడు, భక్తులకు చుట్టమువంటివాఁడు కావున బాణములును అమ్ములపొదులును ప్రకాశించుచున్న విలువిద్య నేర్పు తీవ్రమైన భుజముల లాఘవముచే పొగడ్తగన్న శ్రీరామమూర్తికి సాటిదైవము మఱియొకటి లేదనుచు బ్రహ్మాండ మదురునట్లు ఢాం ఢాం అని భేరికొట్టుచు మదపుటేనుఁగు నెక్కి చాటెదను.

చ. అవనిజకన్నుదోయి తొఁగ ♦ లందు వెలింగెడు సోమజానకీ
కువలయనేత్రి గబ్బిచను ♦ గొండలనుండు ఘనంబు మైథిలీ
నవనవయౌవనంబను వ ♦ నంబునకున్ మదదంతిపీవెకా
దవిలి భజింతు నెల్లపుడు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 35

టీ. అవనిజ=సీతయొక్క, కన్నుదోయి=రెండుకన్నులనెడు, తొఁగలందు కలువపూవులయందు, వెలింగెడు, సోమ=ప్రకాశించుచున్న, చంద్రుడైనవాఁడా, జానకీ=జనకుని కూతురైన సీత అనెడి, కువలయనేత్రి=కలువపూవులవంటి కన్నులుగల, గబ్బి=ఉబ్బులయిన, చనుకొండలన్, ఉండు ఘనంబు=ఉండునట్టి మేఘము, మైథిలి=మిథిలిరాజుకూతురయిన, సీతాదేవి

యొక్క, నవనవ=మిక్కిలిక్రొత్తయయిన, యౌవనంబు=ప్రాయము, అను వనంబునకున్=అనుతోఁటకు, మదదంతివి, మదించిన యేనుగవు, నీవెకాన్=నీవే అని, తవిలి=ఆసక్తిగొని, ఎల్లప్పుడును, భజింతుజ్=సేవింతును.

తా. రామా! నిన్ను సీతాదేవి కన్నుదోయి యనెడి కలువలను వికసింపఁజేసెడు చంద్రుఁడుగాను, జానకీదేవి యుబ్బు చన్నులనెడి కొండల యందుండు మేఘముగాను, మిథిలాపతి కుమారి యలప్రాయమను తోఁటకు మదపుటేనుఁగుగాను, తలఁచి యెప్పుడును నిన్నే సేవించెదను.

చ. ఖరకరవంశజా విను మ ♦ ఖండితభూతపిశాచ ఢాకినీ
జ్వరపరితాపసర్పభయ ♦ వారకమైన భవత్పదాబ్జ వి
స్ఫురదురువజ్రపంజరము ♦ జొచ్చితి నీయెడదీనమానవో
ద్ధరబిరుదాంకమేమఱకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 36

టీ. ఖరకర=సూర్యునియొక్క, వంశ=వంశమునందు, జా=పుట్టువాఁడా, అఖండిత=కొట్టుపడని, భూత=భూతములు, పిశాచ=పిశాచములు, ఢాకిని=ఢాకినులు, జ్వర=జ్వరములు, పరితాప=తాపములు, సర్ప=సర్పములు, భయ=భయములును, వారకము=పోఁగొట్టునది, అయిన=అయినట్టి భవత్=నీయొక్క, పదాబ్జ=పాదపద్మములనెడి, విస్ఫురత్=మిక్కిలి ప్రకాశించుచున్న, ఉరు=గొప్పయయిన, వజ్రపంజరముజ్=వజ్రముతోఁ చేయబడిన గూటిని, జొచ్చితిని=ప్రవేశించితిని, నీయెడ=నీయందు, దీన=దీనులయిన, మానవ=జనులను, ఉద్ధర=ఉద్ధరించువాఁడనెడి, బిరుద+అంకము బిరుదాంకము=బిరుదరూపమయిన చిహ్నము, ఏమఱకు=కోలుపోకుము.

తా. సూర్యవంశమున బుట్టిన శ్రీరామా! భూతములు పిశాచములు, ఢాకినీలు, తాపములు, సర్పములు మొదలగు

వానివలన భయములు పోఁగొట్టునదై, వజ్రపంజరమువలె రక్షించు నీచరణారవిందముల శరణుఁజొచ్చితిని. నీవు దీన మానవోద్ధారకుఁడను బిరుదుగలవాఁడవు. కాబట్టి నన్ను ఉద్ధరింపని వాఁడవై యాబిరుదమును బోఁగొట్టుకొనకుమా.

ఉ. జుఱ్ఱెదమీకథామృతము • జుఱ్ఱెదమీపదకంజతోయమున్
జుఱ్ఱెద రామనామమున • జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుఱ్ఱెద జుఱ్ఱుజుఱ్ఱుఁగ రు • చుల్ గనువారిపదంబుఁగూర్పవే
తట్టులతోడి పొత్తిడక • దాశరథీ కరుణాపయోనిధీ. 37

టీ. మీకథామృతము=మీయొక్క కథలనెడి యమృతమును, జుఱ్ఱెద=జుఱ్ఱుచున్నాను, మీపదకంజ=మీపాదారవిందముయొక్క, తోయమున్=జలమును, జుఱ్ఱెద=జుఱ్ఱుచున్నాను, రామనామమున్=రామనామమునందు, జొబ్బిలుచున్నసుధారసంబు=స్రవించుచున్న అమృతరసమును, జుఱ్ఱెద=జుఱ్ఱుచున్నాను, జుఱ్ఱుజుఱ్ఱుగన్=జుఱ్ఱగా జుఱ్ఱగా, రుచులు=చవులు, కనువారి=ఎరిగినట్టివారియొక్క, పదంబులకున్=స్థానములకును, తట్టులతోడి పొత్తు=నీచులతో స్నేహము, ఇడక=పెట్టక, కూర్పవే=చేర్పుమా.

తా. శ్రీరామా! నీచరిత్రములనెడి యమృతమును, నీపాదతీర్థమును, నీనామములందు స్రవించుచున్న యమృతమును జుఱ్ఱెదరు. నీచరిత్రాదుల యమృతంబును జుఱ్ఱి రుచి తెలిసికొనిన మహానీయుల దివ్యగతిని నాకు గలిగింపుము. నీచుల తోడి పొత్తు మాన్పుము.

ఉ. ఘోరకృతాంతవీరభట • కోటికి గుండెదిగుల్ దరిద్రతా
కారపిశాచసంహరణ • కార్యవినోది వికుంఠ మందిర

ద్వారకవాటభేది నిజ ♦ దాస జనావళికెల్ల ప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 38

టీ. నీ తారకనామము=సంసారమును దాటజేయు నీ నామమును, ఎన్నుకొనన్=తలచుకొనఁగా, ఘోర=భయంకరుడైన, కృతాంత=యముని యొక్క, వీర=శూరులైన, భటకోటికిన్=కింకిరసమూహమునకు, గుండె దిగుల్=గుండెలోనిభయము, దరిద్రతా=దారిద్ర్యముయొక్క, ఆకార=రూపముగల, పిశాచ=పిశాచమును, సంహరణ=చంపుటయనెడి, కార్య=కార్యమునందు, వినోది=క్రీడించునది, నిజ=నీవారైన, దాసజన=కైంకర్యము సేయు జనులయొక్క, ఆవళికి=సమూహమునకు, ఎల్లప్రొద్దున్=ఎల్లప్పుడును, వికుంఠ=విష్ణుదేవునివాసస్థానమయిన పరమపదమనెడి, మందిర=గృహము యొక్క, ద్వార=హజారమునందలి, కవాట=తలుపును, భేది=భేదించునది.

తా. రామా! నీతారకనామము భయంకరులయిన యమదూతలను గుండెలగరజేయును. దరిద్రతఅనెడి పిశాచము ను బోగొట్టును. ఎల్లప్పుడును నీదాసజనులు పరమపదమునకు బోవుటకుగల యడ్డములను తొలగించును.

ఉ. విన్నపమాలకించు రఘు ♦ వీర నహిప్రతిలోకమందునా
కన్నదురాత్ముడుం బరమ ♦ కారుణికోత్తమ వేల్పులందునీ
కన్న మహాత్ముడుం బతిత ♦ కల్మషదూరుడు లేడునాకు వి
ద్వన్నుత నీవె నాకు గతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 39

టీ. రఘువీర=రఘురాజు కులమునఁబుట్టిన శూరుడైనవాడా, విన్నపము=ఒకమనవి, ఆలకించు, ఆమనవి యేమనగా, ప్రతిలోకమందున్=ఒక్కొక్కజగత్తునందును, నాకన్నన్=నాకంటెను, దురాత్ముడు=దుష్టుడు,

నహి=లేఁడు, కారుణికోత్తమ=కరుణగలవారిలోనెల్ల, శ్రేష్ఠుఁడైనవాఁడా, వేల్పులందున్=దేవతలందు, నీకన్నన్=నీకంటెను, మహాత్ముఁడున్=గొప్ప వాఁడును, పతిత=పాపాత్ములయొక్క, కల్మష=పాపములను, దూరుడు=దవ్వుగాఁజేయువాఁడును, నాకున్, లేఁడు=కలుగఁడు, విద్వన్నుత=పండితులచేత కొనియాడఁబడువాఁడా, నీవు నాకున్, గతి=దిక్కు.

తా. రఘువీరా! ఒకమనవి ఆలకింపుము. ఏలోకమందును నాకంటె దుష్టుఁడులేఁడు. దేవతలందు నీకంటె మహాత్ముఁడును పాపరహితుఁడు లేఁడు. కాబట్టి దుష్టులలో శ్రేష్ఠుఁడనైననాకు దేవతలలో శ్రేష్ఠుఁడవైన నీవె దిక్కయి ఉద్ధరింప శక్తుఁడనగుదువు గాని మఱియొకరు గానేరరు.

ఉ. పెంపునఁదల్లివై కలుష ♦ బృందసమాగమ మొందకుండ ర
క్షింపనుదండ్రివై మెయివ♦సించుదశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జవై కృపగు ♦ టించి పరంబు దిరంబుగాఁగ స
త్సంపదలిచ్చు నీవెగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 40

టీ. పెంపను=పోషింపను, తల్లిని, ఐ=అయి, కలుష=పాపములయొక్క, బృంద=సమూహముయొక్క, సమాగమము=కూడికను, ఒందకుండన్=చెందకుండునట్లు, రక్షింపను=కావను, తండ్రివి, ఐ=అయి, మెయిన్=దేహమునందు, వసించు=ఉన్నట్టి, దశేంద్రియ=పదియింద్రియములనెడి, రోగముల్=తెవుళ్ళను, నివారింపను=పోఁగొట్టను, వెజ్జవై=వైద్యుడవై, కృప=దయను, గురించి=గలిగి, పరంబున్=మోక్షమును, తిరంబుగాఁగన్=స్థిరముగునట్లుగా, సత్సంపదలు=మేలయిన సంపత్తులను, ఇయ్యన్=ఇచ్చుటకు, నీవె, గతి=దిక్కు.

తా. పోషించుటకు తల్లివలెను, దోషములను పొందకుండ రక్షింపను తండ్రివలెను దేహమునందలి పదియింద్రియములనెడి రోగములను తొలగించుటకు వైద్యునివలెను మేలయిన సంపదలియ్యను నీవే నాకు దిక్కు.

ఉ. కుక్షినజాండపంక్తులొన • గూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణసేయు తండ్రివి ప • రంపర నీతనయుండనైన నా
పక్షము నీవుగావలదె • పాపము లెన్ని యొనర్చినన్ జగ
ద్రక్షక కర్తవీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 41

టీ. కుక్షిన్=ఉదరమునందు, అజాండ=బ్రహ్మాండముయొక్క, పంక్తులు=సమూహములు, ఒనగూర్చి=పొందికపఱచి అనుట, చర=చరించునట్టి చేతనములును, అచర=చరింపని చేతనములును, జంతు=ప్రాణులయొక్క కోటిన్=సమూహమును, రక్షణ=కాపాడుటను, చేయుతండ్రివి=చేయునట్టి తండ్రివి, పరంపరన్=వరుసగా,తరతరముగా, నీతనయుండును=నీకొడుకును ఐన=యైనట్టి, నాపక్షము=నాయొక్క, పాలిటవాడవు, ఎన్నిపాపములు, ఒనర్చినన్=నేనుచేసినను, నీవు, కావలదె=కావలదా, జగత్=లోకములను,రక్షణ=రక్షించుటయందు, కర్త=కర్తయైనవాడవు, నీవుకద=నీవేకదా.

తా. కుక్షిలోపల బ్రహ్మాండసమూహములను పొందికగా పెట్టుకొని చేతనములను అచేతనములైన సకలప్రాణిసమూహములను రక్షించునట్టి తండ్రివి కాబట్టి తదితరముగ నీకొడుకైయున్న నాపాలిట నీవుపక్షపాతివై యుండవలయును. నేను పాపములు చేసితినని నన్నువిడువరాదు. ఎన్ని పాపములు

చేసినను లోకమెల్ల రక్షించువాఁడవు నీవొక్కఁడవే కనుక నీవే నన్ను కాపాడవలయును.

ఉ. గద్దరియోగి హృత్కమల ♦ గంధరసానుభవంబుఁ జెందు పె
న్నిద్దపుగండుఁ దేఁటి ధర ♦ ణీసుత కౌఁగిలి పంజరంబునన్
ముద్దులుగుల్కు-రాచిలుక ♦ ముక్తినిధానము రామరాఁగదే
తద్దయు నేఁడు నాకడకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 42

టీ. గద్దరి=దిట్టలైన, యోగి=యోగశీలురయొక్క, హృత్=హృదయమనెడి, కమల=తామరయందలి, గంధ=వాసనతోఁగూడిన, రస=మకరందముయొక్క, అనుభవంబున్=ఆస్వాదనమును, చెందు=పొందినట్టియు, పెను=మిక్కిలి, నిద్దపు=నిగనిగయనెడి మిసిమిగల, గండు=మదించిన, తేఁటి=తుమ్మెదయైనవాడు, ధరణీసుత=సీతాదేవియొక్క, కౌగిలి=ఆలింగనమనెడి, పంజరంబునన్=గూటియందు, ముద్దులుగుల్కు=మనోజ్ఞముగానుండు, రాచిలుక=రామచిలుక, ముక్తినిధానము=మోక్షముండెడిచోటు, రామ=శ్రీరామా, నాకడకున్=నాయొద్దకు, నేడు, తద్దయున్=మిక్కిలి, రాగదే=రమ్మా.

తా. తామరలయందలి తేనెను అనుభవించు తుమ్మెదవలె యోగశీలుర హృదయమందు భక్తిరసములు అనుభవించువాఁడును, గూటియందలి రాచిల్కవలె సీతాదేవి కౌఁగిలియందు సొంపుగులుకువాఁడును, మోక్షమిచ్చువాఁడును, అగు శ్రీరామా నేఁడు నాయొద్దకు వేగరమ్మా.

చ. కలియుగ మర్త్యకోటి నినుఁ ♦ గన్గొనరానివిధంబొ భక్తవ
త్సలతవహింపవో చటుల ♦ సాంద్రవిపద్దశవార్ధిఁ గ్రుంకుచోఁ

బిలిచిన బల్కవింతమఱ ♦ పే నరులిట్లనరాదు గాక నీ
తలఁపునలేదె సీతచెఱ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 43

టీ. కలియుగ=కలియుగమందలి, మర్త్యకోటి=మనుష్యసమూహము నిన్ను, కన్గొనరాని విధంబో=తెలిసికొనరానివిధమో, భక్తవత్సలతన్=భక్తులయెడల వాత్సల్యము గలిగియుండుటను, వహింపవో=తాల్పవో, చటుల=మిక్కిలిఅయిన, సాంద్ర=దట్టమైన, విపత్=ఆపదలయొక్క, దశా=అవస్థయనెడి, వార్ధిన్=సముద్రమునందు, క్రుంకుచోన్=నేను మునుఁగునపుడు, పిలిచినన్=నిన్ను పిలువగా, పల్కవు=పలుకవు, ఇంత నన్ను మఱచిపోవుటయా, నరులు=నాబోటిమనుష్యులు, ఇట్లు=ఈప్రకారము ఇంతమఱపాయని, అనరాదు గాక=చెప్పరాదుగాని, నీతలంపునన్=నీచింతయందు, సీతచెర=రావణునిచేత సీత పొందినచెఱ, లేదె=లేదా.

తా. శ్రీరామా! నేను మిక్కిలి ఆపత్సముద్రమున మునుగుఁచు నిన్ను ఎంతపిలిచినను మాఱుపలుకవు, ఇదేల? కలియుగమందు మనుష్యులకు కనఁబడరాదనియా? లేక భక్త జనులయెడల నీకువాత్సల్యము కలుగదా? ఇటులనన్ను మఱచి పోవచ్చునా! నీకు మఱపని మాబోఁటులు చెప్పరాదు. సీతా దేవికి కలిగిన చెఱను మఱవవుగదా? అట్టి మా చెఱకును నీకు మఱపు ఎక్కడిది?

చ. జనవర మీకథాళి విన ♦ సైఁపకకర్ణములందు ఘంటికా
నినద వినోదముల్ సలుపు ♦ నీచునకున్ వరమిచ్చినావు ని
న్ననయమునమ్మికొల్చినమ♦హాత్ముల కేమియొసంగెదోసనం
దనసుతమాకొసంగుమయ ♦ దాశరథీ కరుణాపయోనిధీ44

టీ. జనవర=ఓ రాజా! మీకథాళి=మీకథయొక్క సమూహమును, వినన్=వినుటకు, సైపక=ఓర్వక, కర్ణములందున్=చెవులయందు, ఘంటికా=గంటలయొక్క, నినద=శబ్దములయొక్క, వినోదమున్=వేడుకలను, సలుపునీచునకున్=చేయుచున్న అల్పునికి, వరము=కోరినకోరిక, ఇచ్చినావు, నిన్ను, ఆసమయమున్=ఎప్పుడును, నమ్మి, కొల్చిన మహాత్ములకున్=సేవించునట్టి మహనీయులకు, ఏమి, ఒసంగెదో=ఇచ్చెదవో, సనందననుత=సనందనుఁడు అను ఋషిచేత కొనియాడబడినవాడా, మాకున్, ఒసంగుము=ఇయ్యవయ్యా.

తా. ఓరాజా, మీకథలనువినుటకు ఓర్వక చెవులయందు ఘంటలధ్వనియొక్క వేడుకలను సలుపు నీచునికి కోరినవరము ఇచ్చినావు. ఎప్పుడు నిన్నునమ్మి సేవించునట్టివారికి ఏమిచ్చెదవో సనందనుఁడను ఋషిచేత కొనియాడఁబడినవాడా! వారికిచ్చినట్లే నాకునునిమ్ము.

ఉ. పాపములొందువేళ రణ ♦ పన్నగభూత భయజ్వరాదులం
దాపద నొందువేళ భర ♦ తాగ్రజమిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁదమ్ముఁడిరు ♦ పక్కియలంజని తద్విపత్తి సం
తాపము మాన్పి కాతువట ♦ దాశరథీ కరుణాపయోనిధీ45

టీ. పాపములు, ఒందువేళన్=పొందెడిసమయమునందు, పన్నగ=సర్పము, భూతభయ=భూతములవలన కలుగు భయమును, జ్వర=జ్వరములు ఆదులయందున్=మొదలయిన వానియందు, ఆపదన్=విపత్తును, ఒందువేళన్=పొందు సమయమునను, భరతాగ్రజ=భరతునికి అన్నయైన శ్రీరామా మిమ్మున్=మిమ్ము, భజించువారికిన్=కొలుచువారికి, నీవు=నీవును, తమ్ముడు=తమ్ముఁడయిన లక్ష్మణుడును, ఇరుపక్కియలన్=రెండు ప్రక్కలను,

ప్రాపుగన్=సహాయముగ, చని=పోయి, తత్=వారియొక్క, విపత్తి=ఆపద, చేతనైన, సంతాపమున్=కుదుకును, మాన్పి=పోగొట్టి, కాతువఁట=కాపాడుదువందురు.

తా. దశరథరా! పాపములుపొందుమానవుడును, యుద్ధము, సర్పములు, భూతములు, జ్వరములు మొదలయినవాని చేత ఆపదకలిగినప్పుడును నిన్ను గొలుచున్నట్టివారికి సహాయము సేయఁబోయి నీవును, నీతమ్ముఁడైన లక్ష్మణుఁడును రెండు ప్రక్కల నిలచి వారి యాపదలను పోఁగొట్టి రక్షింతురని లోకులు చెప్పుదురు. కాఁబట్టి నన్నును కాపాడవలయును.

చ. అగణితజన్మకర్మదురి ♦ తాంబుధిలోబహుదుఃఖవీచికల్
తెగిపడనీదఁలేక జగ ♦ తీధవ నీపద భక్తినావచే
దగిలితరింపఁ గోరితిఁ బ ♦ దంపడి నాదుభయంబుమాన్పవే
తగదని చిత్తమందిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 46

టీ. జగతీధవ=భూనాథ, అగణిత=లెక్కింపరాని, జన్మ=జన్మములందలి, కర్మపరంపరలచేగల్గిన, దురిత=పాపములనెడి, అంబుధిలోన్=సముద్రమందు, బహు=అనేకములయిన, దుఃఖ=దుఃఖములనెడి, వీచికల్=అలలను, తెగిపడన్=కడచునట్లు, ఈదఁలేక=ఈఁదజాలక, పదంపడి=పిమ్మట, నీపద భక్తినావచేన్=నీయొక్క పాదములందలి భక్తియనెడి ఓడచేత, తగి=ఆసక్తితోడ, తరింపగోరితిన్=దాటను ఇచ్ఛగించితిని, తగదు అని=తగిలినదికాదు అని, చిత్తమందు=నీమనస్సునందు, ఇడక=ఉంచుకొనక, నాభయంబున్=నాయొక్కభయమును, మాన్పవే=పోగొట్టుమా.

తా. భూనాథా! లెక్కింపరాని జన్మములందలి కర్మపరంపరలచే గలిగిన పాపములు సముద్రమువలె అపారమై నాయం

తటపోఁగొట్టుకొనుటకు శక్యముగాక, నీయందలి భక్తిగలిగి ఈదరాని సముద్రము ఓడచే సులువుగా దాటునట్లు తొలఁగింపరాని నాపాపములను సులువుగా నీభక్తిచేఁ బోఁగొట్టుకొనఁ గోరితిని. కావున శరణుఁజొచ్చిన నాయొక్క భయమును పోఁగొట్టుమా.

ఉ. నేనొనరించుపాపము ల ♦ నేకములైనను నాదుజిహ్వకుం
బానకమయ్యెమీపరమ ♦ పావననామముదొంటిచిల్కరా
మా ననుఁగావుమన్న తుది♦మాటకుసద్గతిఁ జెందెఁగావునన్
దానిధరింపఁగోరెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 47

టీ. నేను, ఒనరించుపాపములు=చేయునట్టిపాపములు, అనేకములు=పెక్కులు, ఐనను, నాదుజిహ్వకు=నాయొక్కనాలుకకు, మీపరమపావననామము=మీయొక్క మిక్కిలి పవిత్రమైన పేరు, పానకము అయ్యెన్=పానకమువలె రుచియైనదని, తొంటిచిల్క=పూర్వకాలపు చిలుక, రామా, నన్నుకావుము=నన్నురక్షింపుము, అన్నతుదిమాటకున్=అనిపలికినట్టికడపటి పలుకునకు, సద్గతిన్=మోక్షమును, చెందున్=పొందెను, కావునన్=కనుక, దానిన్=అరామనామమును, ధరింప కోరెదను=తాల్చుట కిచ్ఛగించెదను.

తా. దశరథరామా! పాపములనేకములు నేను చేయుచున్నవాఁడను. ఇట్టి పాపాత్ముఁడనైనను నీదివ్యనామముఉచ్చరించుట నా నాలుకకు బానకమువలె మిక్కిలి రుచ్యమైనది. ఎట్లనఁగా పూర్వమొకచిలుక రామా! నన్నుఁ గావుము, అని కడపట నొక్కమాట చెప్పగానే మోక్షమునొందెను గదా.

అట్టిస్థితిని ఇచ్చునది గాన నాకు అతిరుచిగల నీనామము పఠించెదను.

చ. పరధనముల్ హరించి ♦ పరభామలనంటిపరాన్నమబ్బినన్
మురిపముకానిమీఁదనగు ♦ మోసమెఱుంగదుమానసంబుదు
స్తరమిది కాలకింకర గ ♦ దాహతి పాల్పడనీక మమ్మునే
తఱి దరిజేర్చి కాచెదవొ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 48

టీ. పరధనముల్=ఇతరధనములనుహరించి, పరభామలను=యితరుల యిల్లాండ్రను, అంటి=తాగి, పరాన్నము=ఇతరులకూడు, అబ్బినన్=దొరకఁగా, మురిపముకాని=విలాసమేకాని, మీఁదన్=అటుపిమ్మట, అగుమోసము=కలుగునట్టిమోసమును, మానసంబు=మనస్సు,ఎఱుంగదు ఇది=ఇట్లు తెలియకుండుట, దుస్తరము=తరింపరానిది, కాలకింకర=యమదూతలయొక్క, గదా=గదలయొక్క, హతి=దెబ్బలయొక్క, పాలు=అధీనత, పడనీయక=పొందనీక, మమ్మున్, ఏతఱిన్=ఎప్పుడు, దరిచేర్చి, కాచెదవో=రక్షింతువో

తా. దశరథరామా! పరులధనములను దొంగిలించుట పరస్త్రీలను గూడుట, పరాన్నమును దినుట, మొదట సుఖముగానుండినను వెనుక నరకము గలిగించును. ఇది మనస్సునకు తెలియదు. మనస్సు జయించుట కష్టము గనుక మనస్సుపోయినదారిని పోయి నరకమున బడకుండునట్లు మమ్ము నెప్పుడు కడతేర్చి కాపాడెదవో కదా.

ఉ. చేసితి ఘోరకృత్యములు ♦ చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైనములఁ ♦ జేరి భజించిన వారిపొందు నేఁ

జేసిననేరముఁల్ దలఁచి ♦ చిక్కులఁబెట్టకుమయ్యయయ్యనీ
దాసుఁడనయ్య భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 49

టీ. ఘోరకృత్యములు=భయంకరములయిన కార్యములను, చేసితిని, భాగవతాపచారముల్=భాగవత జనులయెడల, అపరాధములను చేసితిని, అన్యదైవములన్=ఇతర దేవతలను, జేరి=ఆశ్రయించి, భజించిన వారిపొందును=కొలచినట్టివారి సాంగత్యమును, చేసితిని, నేన్=నేను, చేసిన నేరములు=కావించునట్టి తప్పులను, తలఁచి=ఎంచి, చిక్కులన్ పెట్టకుము అయ్య=సంకటములందు తగల్పకుమయ్య, అయ్య! నీదాసుడను=అయ్యా! నీయొక్కదాసుడను.

తా. రామా, నేను ఘోరకార్యములను, భాగవతుల కపచారములను అన్యదైవముల గొలుచువారితో సాంగత్యము జేసితిని. నాతప్పులను క్షమింపుము, నీకు దాసుడను.

చ. పరులధనంబుఁజూచిపర ♦ భామలఁజూచి హరింపగోరు మ
ద్గురుతర మానసంబనెడు ♦ దొంగనుబట్టి నిరూఢదాస్య వి
స్ఫురిత వివేకపాశములఁ ♦ జుట్టి భవచ్చరణంబనే మరు
త్తరువునగట్టివేయగదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 50

టీ. పరధనంబున్=ఇతరులసొత్తును, చూచి, పరభామలన్=పరస్త్రీలను, చూచి, హరింపన్=అపహరించుటకు, కోరునట్టి, మత్=నా, గురుతర=మిక్కిలిగొప్పదైన, మానసంబు=మనస్సు, అనెడుదొంగను, పట్టి=పట్టుకొని, నిరూఢ=మిక్కిలి పెరిగిన, దాస్య=కైంకర్యమునందు, విస్ఫురిత=మిక్కిలిప్రకాశించిన, వివేక=తెలివియను, పాశములన్=తాళ్ళచేత, చుట్టి=బం

ధించి, భవచ్చరణంబు=నీపాదము అనే మరుత్ తరువునన్=అనెడు దేవతా వృక్షమున, గట్టివేయన్ కదె=బంధించివేయుమా.

తా. యితరగలసొత్తులను స్త్రీలను చూచి దొంగిలింప కోరు నామనస్సు అను దొంగను పట్టుకొని నీకైంకర్యముచే ప్రకాశించునట్టి తెలివియనెడి కల్పవృక్షమునకు గట్టివేయుము.

చ. సలలిత రామనామ జప ♦ సార మెఱుంగను, గాశికాపురీ
నిలయుడఁగాను, మీచరణ ♦ నీరజరేణు మహాప్రభావముం
దెలియనహల్యగాను, జగ ♦ తీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగరావణాసురుని ♦ తమ్ముఁడగాను,భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 51

టీ. సలలిత=మిక్కిలి ఒప్పుచున్న, రామనామ=రామనామముయొక్క, జప=జపముయొక్క, సారము=సత్తువను, ఎఱుంగను=తెలియుటకు కాశికాపురీనిలయుఁడను=కాశీపట్టణము వాసస్థానముగల శివుఁడనుకాను, మీచరణనీరజ=మీపాదపద్మములయొక్క, రేణు=దుమ్ముయొక్క, మహాప్రభావమున్=గొప్పమహాత్మ్యమును, తెలియన్=తెలియుటకు, అహల్యను కాను=అహల్యను కానేరను, జగతీవర=భూనాథా, నీదగుసత్యవాక్యము=నీదైనట్టి నిజమైనమాటను, తలపగన్=ఎన్నుటకు, రావణాసురుని తమ్ముడను=విభీషణుఁడను కాను, భవత్ విలాసముల్=నీవిలాసములు, తలచి=ఎన్ని, నుతింపన్=పొగడుటకు, నాతరమె=నాకుశక్యమా.

తా. రామా! నీనామమును జపము చేయుటవలననిపన శివునకు, నీపాదధూళిప్రభావము అహల్యకు, నీసత్యసంధత్వము విభీషణునకును తెలియును. కాని నీలీలలు నాబోటివానికి తెలియతరముకాదు.

ఉ. పాతకులైన మీకృపకుఁ ♦ బాత్రులుకారెతలంచిచూడ జ
ట్రాతికిఁగల్గె బావన మ ♦ రాతికి రాజ్యసుఖంబుగల్గె దు
ర్జాతికిఁ బుణ్యమబ్బెగపి ♦ జాతిమహత్వమునొందెఁగావునం
దాతవ యెట్టివారలకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ 52

టీ. పాతకులైనన్ = పాపాత్ములైనను, మీకృపకు = మీదయకు, పాత్రులు కారె = అర్హులే కాదా, తలంచిచూడన్ = ఎన్ని చూడఁగా, చట్రాతికిన్ = చట్టురాయిగానున్న అహల్యకు, పావనము = పవిత్రత్వము, కల్గెన్ = కలిగెను, అరాతికిన్ = శత్రువైన విభీషణునికి, రాజ్యసుఖంబు = రాజ్యప్రాప్తి యనెడిసుఖము, కల్గెన్ = కల్గెను, దుర్జాతికి = నీచజాతులవారికిని, పుణ్యము = సుకృతము, అబ్బెన్ = లభించెను, కపిజాతి = వానరజాతి, మహత్వము = మహిమను, పొందెన్ = ఒందెను, కావునన్ = కనుక, ఎట్టివారలకున్ = ఎంతటివారలకైనను, దాతవ = కోర్కెలనీయువాఁడవే.

తా. రామా! పాపాత్ములైనను మీకృపకు పాత్రులై యున్నారు. అహల్య నీపాదరజముచే నిజరూపమొందినది. విభీషణుఁడు నీవలన లంకారాజ్యము నొందినాడు. జటాయువు, శబరిమొదలయిన తక్కువజాతులకును నీయనుగ్రహము గలిగినది. సుగ్రీవాదులైన వానరులకుఁ గూడ మహత్వము గలిగినది. ఇవన్నియు జూడఁగా నీవు ఎక్కువ తక్కువలు పాటింపక ఎట్టి వారికైన కోరిన కోర్కులనిచ్చు దాతవని తెలియుచున్నది.

ఉ. మామక పాతకవ్రజము ♦ మాన్పనగణ్యముచిత్రగుప్తు లే
మేమని వ్రాఁతురో శమను ♦ డేమివిధించునో కాలకింకర

స్తోమ మొనర్చు టేమొ విన • జొప్పడ దింతకుమున్నె దీనచిం
తామణి యెట్లుగాచెదవొ • దాశరథీ కరుణాపయోనిధీ. 53

టీ. మామక=నా, పాతకవ్రజము=పాపసమూహము, మాన్పన్=పోగొట్టుటకు, అగణ్యము=లెక్కింపరానిది, చిత్రగుప్తులు=యముని యొద్ద జీవుల పుణ్యపాపములను లెక్క వ్రాయుచుండు కరణము, ఏమి ఏమి అని=యేవిధముగా, వ్రాతురో=వ్రాయుదురో, శమనుఁడు=యముఁడు, ఏమి=ఏమిఫలము, విధించునో=ఆజ్ఞాపించునో, కాలకింకరస్తోమ=యమదూతల సమూహము, ఒనర్చుట=చేయుట, ఏమో=ఏదియో, వినన్=వినుటకు, చొప్పడదు=సరిపడదు, ఇంతకుమున్నె=దీనికి పూర్వమే, దీనచింతామణి=దీనులయినవారికి, చింతామణివలెకోరిన కోర్కెలు ఇచ్చువాఁడా, ఎట్లు=ఏవిధమున, కాచెదవో=కాపాడెదవో.

తా. రామా! నాపాపములు పోగొట్టుటకుఁ జాలఁకలవు—చిత్రగుప్తుడేమి వ్రాయునో? యముఁడేమి విధించునో? కాలకింకరు లేమిచేయుదురో? ఇంతకుఁ బూర్వమే దీనరక్షణకై కంకణముఁ గట్టుకొని కోర్కెలు దీర్చు నీవెట్లు కాపాడెదవో తెలియరాదు.

ఉ. దాసిన చుట్టమా శబరి • దానిదయామతి నేలినావు, నీ
దాసుని దాసుఁడా గుహుఁడు • తావకదాస్యమొసంగినావు నే
జేసినపాపమో! వినుతి • చేసిన గావవు గావుమయ్య నీ
దాసులలోన నేనొకఁడ • దాశరథీ కరుణాపయోనిధీ. 54

టీ. శబరి, దాసిన=దగ్గఱ, చుట్టమా=వియ్యమా, దయామతిన్=దయతో గూడిన బుద్ధితో ఏలినావు=రక్షించినావు, గుహుఁడు, నీదాసుని

దాసుఁడా=నీ సేవకుని సేవకుఁడా, తానకదాస్యము=నీదైన సేవను, ఒసంగి నావు=ఇచ్చితివి, వినుతి=స్తోత్రమును, చేసినన్=నేను చేసినను, కావవు= రక్షింపవు, నేఁ=నేను, చేసినపాపమో=చేసినదోషమా, నీదాసులలో నన్=నీసేవకులలోపల, నేను ఒకడను, కావవయ్యా=రక్షింపుమా.

తా. రామా! శబరి నీకు దగ్గఱ చుట్టము కాదు. దానిని కాపాడితివి. గుహుఁడు నీదాసునికిఁగూడ దాసుఁడు గాడు. కాకపోయినను దాసునిఁగా జేసికొంటివి. నేను నీదాస వర్గములో ఒకఁడుగా నున్నాఁడను. మరియు నిన్ను స్తోత్రము చేసినను నేను చేసినపాపమేమో కాని నన్నుఁగాపాడవు. ఇఁక నయినను కాపాడుమా.

ఉ. దీక్షవహించి నాకొలఁది ♦ దీనుల నెందఱిఁ గాచితో జగ
ద్రక్షక తొల్లియా ద్రుపద ♦ రాజతనూజ తలంచినంతనే
యక్షయమైన వల్వలిడి ♦ తక్కట నామొఱఁ జిత్తగించి
ప్రత్యక్షము గావవేమిటికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ 55

టీ. జగద్రక్షక=జగమును రక్షించువాడా, దీక్షన్=నియమమును, వహించి=తాల్చి, నాకొలదిదీనులఁ=నావలెదిక్కులేనివారిని, ఎందఱిని కాచితో=కాపాడితివో, తొల్లి=ముందు, ఆద్రుపదరాజతనూజ=ద్రుపద రాజు కూతురైనయా ద్రౌపది, తలఁచినంతనే=స్మరించగానే, అక్షయ మైన వల్వలు=తరుగనట్టి చీరలు, ఇడితి=ఇచ్చితివి, అక్కట=అయ్యో, నామొఱన్=నామనవిని, చిత్తగించి=ఆలకించి, ప్రత్యక్షము=సాక్షాత్తుగా, కావవు ఏమిటికి=ఏల కాపాడవు.

తా. లోకరక్షా, నీవు ఆశ్రితులను రక్షించునియమము నుపూని, ఎందఱిని కాపాడితివో నాకు తెలియదు. నేను విని

నంతవఱకు తొల్లి ద్రౌపది దుర్యోధనుని సభలో చీరలు ఒలుచునపుడు నిన్ను స్మరించగానే లెక్కలేని చీరలిచ్చితివఁట. అయ్యో నా మొఱ యాలించి నన్నేల కాపాడవు ?

ఉ. నీలఘనాభమూర్తివగు • నిన్నుఁగనుంగొనఁ గోరివేడినన్
జాలముసేసి డాగెదవు • సంస్తుతికెక్కిన రామనామ మే
మూలను దాచుకోఁగలవు • ముక్తికి బ్రాపది పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల • దాశరథీ కరుణాపయోనిధీ. 56

టీ. నీల=నల్లని, ఘన=మేఘముతో, ఆభ=సాటియైన, మూర్తివి=దేహముగలవాడవు, అగునిన్నున్=అయినట్టి నిన్ను, కనుఁగొనన్=చూచుటకు కోరి=అపేక్షించి, వేడినన్=ప్రార్థింపగా, జాలము చేసి=మాయచేసి, డాగెదవు=దాగుకొనెదవు, సంస్తుతికిన్=పొగడ్తకు, ఎక్కిన, రామనామము=వచ్చినట్టి రామనామము, ఏమూలను=ఏమూలయందు, దాచుకొనగలవు=దాచుకొన నేర్తువు, అది=ఆ రామనామము, మాయెడలన్=మాయందు, ముక్తికిన్=మోక్షమునకు, ప్రాపు=ఊతపట్టు, పాప=పాపములయొక్క, మూల=వేళ్లకు, కుద్దాలము=కుద్దలి, కాదె=కదా.

తా. రామా, నల్లనిదగు నీమేనుకన్నార చూడవలయునని యెంతవేడినను మాయముచేసి దాఁచుకొనెదవు. మంచిది. నీవు దాగినను కీర్తినిపొందిన నీ రామనామమును నీవు యెక్కడను దాచలేవు. మాపాపములను గుద్దలి వేళ్ళను పెల్లగించునట్లు సమూలముగాఁ బోఁగొట్టి మోక్షమిచ్చుటకు అదియొకటి కావ అదియే చాలును.

చ. వలదు పరాకు భక్తజన ♦ వత్సల నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు ♦ వజ్రమువంటిది కావకూరకే
వలదు పరాకు నాదురిత ♦ వార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలతుమెకా నిరంతరము ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 57

టీ. భక్తజన=భక్తులకు, వత్సల=వాత్సల్యముకలవాఁడా, నీచరితంబు నీచరిత్రము, వమ్ము=వ్యర్థము, కావలదు=కాకూడదు, పరాకు=హెచ్చరిక, నీబిరుదు=భక్తులరక్షకుడనెడి బిరుదు వజ్రమువలె గట్టిది, కావక=(మమ్ము) రక్షింపక, ఊరకే=వ్యర్థముగా, వలదు=వద్దు, పరాకు=హెచ్చరిక, నాదురితవార్ధికిన్=నాపాపసముద్రమునకు, తెప్పవుగాన్=తెప్పగా, మనంబులోన్=మనస్సునందు, నిరంతరము=ఎప్పుడును, తలతుమెకా=తలంతుముసుమా.

తా. భక్తరక్షా! భక్తులరక్షణలు దెలుపు నీచరిత్రమును, ఆశ్రితరక్షకుఁడని వజ్రమువలె అభేద్యమైన నీబిరుదువ్యర్థమగును. అట్లుచేయవలదు. జాగ్రత్తసుమీ, విను. సముద్రము దాటించు తెప్పవలె నాపాపములు పోఁగొట్టువానినిగా మనస్సులో ఎప్పుడును తలంతును.

ఉ. తప్పులెఱుంగలేక దురి ♦ తంబులు సేసితి నంటి నీవు మా
యప్పవుగావుమంటి నిఁక ♦ నన్యులకున్ నుదురంటనంటినీ
కొప్పిదమైన దాసజను ♦ లొప్పినబంటుకు బంటనంటి నా
తప్పుల కెల్ల నీవెగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 58

టీ. తప్పులు=దోషములను, ఎఱుంగలేక=తెలిసికొనలేక, దురితంబులు=పాపములను, చేసితిన్ అంటి=చేసినానని చెప్పితిని, నీవు, మాయప్పవు=

మాతండ్రివి, కావుమంటి=రక్షింపుమని చెప్పితిని, ఇకన్, అన్యులకున్=ఇతరులకు, నుదురు=నెత్తిని, అంటనుఅంటి=తాకనని చెప్పితిని, నీకు ఒప్పిదమైన=తగినట్టివారైన, దాసజనులు=సేవక సమూహములు, ఒప్పిన బంటుకున్=సమ్మతించి స్వీకరించిన సేవకునికి, బంటను అంటి=సేవకుడను అంటిని, నాతప్పులకున్ ఎల్లన్=నా అన్ని దోషములకును, నీవ, గతి=దిక్కు.

తా. రామా, దోషములని తెలిసికొనలేక పాపములు చేసితిని. నీవు మాతండ్రివి. రక్షింపుమా ఇఁక మీఁద ఇతరులకు నమస్కారము చేయను. నీదాసులకు దాసుఁడను అని నీతో చెప్పికొంటిని ఇఁక నీదాసుల తప్పుల నెట్లో అట్లే నీదాసులకు దాసుఁడనైన నాతప్పులనుదీర్చు దిక్కు నీవేసుమీ.

చ. ఇతఁడు దురాత్ముఁడంచు జనులెన్నఁగ నాఁడికొంటినేనెపో
పతితుఁడ నంటినో పతిత పావనమూర్తివి నీవుగల్గ నే
నితరుల వేడనంటి నిహ మిచ్చిన నిమ్ము పరంబొసంగుమీ
యతులిత రామనామ మధురాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మికొల్చెదను దాశరథీ కరుణాపయోనిధీ. 59

టీ. ఇతడు=వీడు దురాత్ముఁడు + అందున్=దుష్టమనస్సుగలవాడు, అనుచు, జనులు=లోకులు, ఎన్నగన్=తలపగా, ఆరడిన్ కొంటిని=నిందపడితిని, నేనెసుమీ, పతితుడను అంటి=పాపాత్ముడను అని చెప్పితిని, ఓ రామా, పతిత=పాపాత్ములైనవారిని, పావన=పవిత్రులను చేయు మూర్తివి అగు, నీవు కల్గన్=కలిగియుండగా, నేను ఇతరులన్=అన్యులను, వేడను, అంటిన్=ప్రార్థింపనని చెప్పితిని, ఇహము=ఇహలోకసుఖము, ఇచ్చినన్=ఇచ్చితివని, ఇమ్ము, పరంబు=పరలోక సౌఖ్యమును, ఒసంగుమీ=

ఇచ్చినట్లయిన ఇమ్మా, అతులిత=సాటిలేని, రామనామ="రామ" అనెడి పేరుయొక్క, మధుర=తీయనైన, అక్షర=అక్షరములయొక్క, పాళి=సమూహము, నిరంతరము=ఎప్పుడును, హృద్గతము=మనసును పొందినది, నా మనస్సులోనున్నదని, నమ్మికొల్చెదను=సేవించెదను.

తా. నేను దుష్టమనస్సు గలవాఁడనని జనులచేత నింద పడితిని, నేనేపతితుఁడనని నీతో చెప్పుకొంటిని. పాపులను పవిత్రులనుగాఁ జేయనవతరించి నీవుండగా పాపుడనైన నేను నిన్ను వేడెదగాని మఱియొకరిని వేఁడనని చెప్పితిని. ఇఁక నీవొకడవే నాకు స్వామివిగనుక ఇహమిచ్చినను యివ్వవలయును, పరమిచ్చిన నీవీయవలయును, మనస్సున నిలుపుకొని సేవచేసెదను.

ఉ. అంచితమైన నీదుకరు ♦ ణామృతసారమునాదుపైని బ్రో
క్షించినఁజాలు దాన నిర ♦ సించెదనాదురితంబులెల్లఁదూ
లించెద వైరివర్గ మెడ ♦ లించెదఁ గోర్కులనీదుబంటనై
దంచెద, గాలకింకరుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 60

టీ. అంచితం=ఒప్పునది, ఐన నీదుకరుణా=అయినట్టి నీదయఅనెడి, అమృతసారము=అమృతముయొక్క తేట, నాదుపైన=నామీద, ప్రోక్షించినన్=చల్లినచో, చాలున్=అదియేచాలును, దానన్=దానిచే, నాదురితంబులు ఎల్లన్=నాపాపము లన్నియు, నిరసించెదన్=వదలెదను, వైరివర్గము=శత్రుసమూహమును, తూలించెదన్=చెదురునట్లు చేసెదను, కోర్కులన్=రాగములను, ఎడలించెదన్=లేకుండా చేసెదను, నీదుబంటును ఐ=నీదానుండనై, కాలకింకరులన్=యమదూతలను, దంచెదన్=తరిమెదను.

తా. రామా, ఒప్పిదమైన నీదయామృతమును నామీద చల్లిన చాలును. దానిచేతనే నాపాపములుపోయి అంతశ్శత్రు

వులయిన యింద్రియములను చిక్కబట్టి రాగద్వేషములను వద
లి, నీదాసుఁడనై యమకింకరులు వచ్చిన కొట్టి తఱిమెదను.

చ. జలనిధులేడునొక్కమొగిఁ ♦ జక్కికిఁదెచ్చెశరంబు, రాతినిం
పలరఁగ జేసెనాతిగఁ బ ♦ దాబ్జపరాగము, నీచరిత్రముం
జలజభవాది నిర్జరులు ♦ సన్నుతి సేయఁగ లేరు గావునం
దలపనగణ్యమయ్యెయిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ 61

టీ. శరంబు=నీబాణము, జలనిధులు ఏడున్=ఏడుసంద్రములను, ఒక్కమొగిన్=ఒక్కసారిగా, చక్కికిన్=ఒక్కచోటికి, తెచ్చె=తెచ్చెను, పదాబ్జ=తామరలవంటి నీయడుగుల, పరాగము=ధూళి, రాతిన్=రాతిని, ఇంపు=మనోజ్ఞత, అలరంగన్=ఒప్పునట్టుగా, నాతిగన్=స్త్రీగా, చేసెను, చరిత్రమున్=నీచరిత్రమును, జలజభవ=బ్రహ్మ, ఆది=మొదలుగాగల, నిర్జరులు=దేవతలును, సన్నుతిసేయఁగ=స్తోత్రముచేయుగా, లేరు, కావునన్=కనుక, తలఁపన్=విచారింప, అగణ్యము=గణుతింపరానిది.

తా. రామా, నీబాణము సప్తసంద్రములను ఒక్కచో టికి తీసికొని వచ్చినది. పాదపద్మములరజస్సు రాతిని స్త్రీగా జేసినది. ఇట్టి నీచరిత్రము బ్రహ్మాదులకయినను, పొగడనశక్యము. కావున దానిని గణుతింప నసాధ్యము.

ఉ. కోతికిశక్యమా యసుర ♦ కోటుల గెల్వనుగెల్చెఁబోనిజం
బాతనిమేనశీతకరుఁ ♦ డౌట దవానలుఁ డెట్టివింత ! మా
సీతపతివ్రతామహిమ ♦ సేవకుభాగ్యమువీకటాక్షముక్
ధాతకు శక్యమాపొగడ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 62

టీ. అసురకోట్లను=కోట్లకొలది రాక్షసులను, గెల్వన్=గెల్చుటకు, కోతికిన్=ఒక కోతికి, శక్యమా=తరమా, గెల్చెన్‌బో=గెలువనీ, అతని మేనన్=ఆవానరుని దేహమునందు, దవానలుడు=కాఱుచిచ్చు, శీతకరుడు=చంద్రుఁడు, ఔట=అగుట, ఎట్టివింత=యెంతటి యాశ్చర్యము, మాసీత=తల్లియైన సీతయొక్క, పతివ్రతా=పాతివ్రత్యముయొక్క, మహిమ=గొప్పతనమును, సేవకుభాగ్యము=మిమ్ము సేవించుభాగ్యమును, మీ కటాక్షమున్=మీయొక్కదయను, పొగడన్=స్తుతించుటకు, ధాతకున్=బ్రహ్మదేవునికి, శక్యమా=తరముకాదు.

తా. రామా! ఒకకోఁతి కోట్లకొలఁది రాక్షసులను గెలుచుట శక్యముఁకాదు. అదియెట్లో శక్యమైనను కానిమ్ము. కాని అతనితోఁకయందు అంటించిన నిప్పు వేఁడిమిసూపక చల్లనగుట మఱియు నాశ్చర్యము. ఇంతకు సీతయొక్క పాతివ్రత్య ప్రభావమును మీయిరువురిని సేవించినవాని భాగ్యమును, మీకరుణాకటాక్షమును కారణము. కనుక ఈమూఁటిని ధాతకైన పొగడఁదరముగాదు. మముఁబోటులు ఏమని వర్ణింపగలరు.

ఉ. భూపలలామరామరఘు ♦ పుంగవరామ త్రిలోకరాజ్య సం
స్థాపనరామ మోక్షఫల ♦ దాయకరామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నిను ♦ బ్రస్తుతిచేసెదనయ్యరామ సీ
తాపతి రామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 65

టీ. భూపలలామ=రాజశ్రేష్ఠుడవైన, రామ=రామా, రఘుపుంగవ=రఘువంశజులలో శ్రేష్టుడవయిన రామ, త్రిలోక=ముల్లోకముల, రాజ్య=రాజ్యమును, సంస్థాపన=స్థాపించునట్టి, రామా, మోక్ష=మోక్షమనెడి, ఫల=ఫలమును, దాయక=ఇచ్చు, రామ, సీతాపతిరామ=సీతకు భర్తవైన రామా

నిన్నున్, ప్రస్తుతిచేసెద=స్తుతించెదను, మదీయపాపముల్=నాపాపములను రామ, పాపఁగదయ్యా=పోఁగొట్టుమా,

తా. రామా! నీవు రాజులలోనెల్ల శ్రేష్ఠుఁడవు. మఱియు రఘువంశజులలో శ్రేష్ఠుఁడవు. ముల్లోకములను కుదురుగా నుండునట్లు, ఏలునట్టిదిట్టవు. దానికంటె మిక్కిలి అతిశయమైన మోక్షఫలమును ఇచ్చువాఁడవు. అన్నిటికిని అతిశయించిన లక్ష్మీస్వరూపమగు సీతకు భర్తవు. ఇట్టి మితిలేని అతిశయమును గలవాడవు గావున కోరినకోర్కులియ్యవచ్చును. తెలిసినంత నఱకు నిన్ను పొగడెదను. ఆ పొగడ్తనుబట్టియైనను, నాపాపములను పోఁగొట్టి నన్ను గాపాడుము.

ఉ. నీసహజంబు సాత్త్వికము ♦ నీవిడిపట్టు సుధాపయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు, గమ♦లాలయనీప్రియురాలు నీకుసిం
హాసనమిద్ధరిత్రి, గొడు♦గాకసమక్షులు చంద్రభాస్కరుల్
నీసుమతల్ప మాదిఫణి ♦ నీవెసమస్తము గొల్చినట్టి నీ
దాసులభాగ్యమెట్టిదయ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 64

టీ. సాత్త్వికము=సత్త్వగుణము, నీసహజంబు=నీకు సహజమైనది, సుధాపయోనిధి=పాలసముద్రము, నీవిడిపట్టు=నీ విడిది, ఆత్మజుడు=నీకొడుకు, పద్మాసనుఁడు=బ్రహ్మ, నీ ప్రియురాలు, కమలాలయ=లక్ష్మీదేవి, ఈ ధరిత్రి= ఈ భూమి, నీకు, సింహాసనము, ఆకశము= ఆకాశము, గొడుగు, చంద్రభాస్కరులు=సూర్యచంద్రులు, అక్షులు=కన్నులు, ఆదిఫణి=శేషువు, నీసుమతల్పము=నీపాన్పు, సమస్తమున్=అన్నియు, ఇట్టి నిన్ను, కొల్చినట్టి=సేవించునట్టి, నీదాసుల భాగ్యము=నీదాసుల పెంపు, ఎట్టిదయ్యా=ఎట్టిదయ్యా.

తా. రామా! సత్వగుణము నీస్వభావము, నీవిడిదిపాలసముద్రము, నీకొడుకు బ్రహ్మ, నీభార్య లక్ష్మి, ఈభూమి నీసింహాసనము, ఆకాశము నీగొడుగు, నీకన్నులు చంద్రసూర్యులు, ఆదిశేషుఁడు నీపూవుపాన్పు, అన్నియు నీసొమ్మే యగును. సర్వమునకును, స్వామివయిన నిన్నుఁగొల్చిన భక్తుల భాగ్యము ఎట్టిదో చెప్పఁదరమా?

చ. చరణముసోఁకినట్టి శిల ♦ జవ్వనిరూపగు టొక్కవింత, సు
స్థిరముగ నీటిపై గిరులు ♦ దేలిన దొక్కటివింతగాని మీ
స్మరణఁదనర్చు మానవులు ♦ సద్గతిఁజెందిన దెంతవింత? యీ
ధరను ధరాత్మజారమణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 65

టీ. ధరాత్మజారమణ=ఓరామా! చరణముక్=నీపాదమును, సోఁకినట్టిశిల=తాకినట్టిరాయి, జవ్వనిరూపగుట=స్త్రీయగుట, ఒక్కవింత=ఒకయాశ్చర్యము, నీటిపయిక్=నీటిమీద, గిరులు=కొండలు, సుస్థిరముగన్=నిలుకడగా, తేలినది=తేలుచుండెడిది, ఒక్కటివింత=మఱియొక ఆశ్చర్యము, కాని మీస్మరణన్=మిమ్ముస్మరించుటయందు, తనర్చుమానవులు=ఒప్పునట్టి మనుష్యులు, సద్గతిన్=మోక్షమును, జెందినది=పొందినది, ఈధరన్=ఈ భూమియందు, ఎంత వింత=ఎంత ఆశ్చర్యము.

తా. రామా! పాదములను తాఁకిన రాతిని స్త్రీగాఁజేయుటయు, కొండలను నీళ్ళమీఁద మునుఁగకుండునట్లు నిల్పుటయు నాశ్చర్యము. నిన్ను స్మరించిన వానికి నీవు మోక్షము నొసగుట ఒక ఆశ్చర్యము కానేరదు.

ఉ. దైవము తల్లిదండ్రి తగుదాత గురుండుసఖుండు నిన్నె కా
భావన సేయుచున్న తఱి ♦ పాపములెల్ల మనోవికారదు
ర్భావితుఁ జేయుచున్నవి కృపామతివై ననుగావుమీజగ
త్పావనమూర్తి భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 66

టీ. జగత్పావనమూర్తి=లోకములను పవిత్రముచేయు రూపముగల వాఁడా, దైవము, తల్లి, తండ్రి, తగుదాత=తగునట్టిదాత, గురుండు=గురువు, సఖుఁడు=స్నేహితుఁడు, నిన్నె=నీవె, కాన్=అగునట్లు, భావన సేయుచున్న తఱిన్=భావించుచున్న సమయమందు, పాపములు ఎల్ల=పాపములన్నియును మనః=మనస్సుయొక్క, వికార=వికారము చేత, కృపామతివి అయి=దయ గల మనస్సుగలవాడవై, ననున్, కావుమీ=రక్షింపుమా.

తా. రామా! నేను నిన్ను దైవముగాను, తల్లిదండ్రులుగాను, గురువుగాను, స్నేహితుఁడుగాను భావించుచుండఁగా నాపూర్వపాపములన్నియుఁ జేరి నామనస్సును కలఁచి దుష్టభావములు కల్పించి చెరుపుచున్నవి. లోకుల పాపముల బోఁగొట్ట నవతరించిన వాఁడవు. కనుక నాపాపములను బోనణఁచి నన్ను కాపాడుమా.

ఉ. వాసవరాజ్యభోగ్యసుఖ ♦ వార్ధిని దేలు ప్రభుత్వమబ్బినా
యాసకుమేరలేదు కన ♦ కాద్రి సమానధనంబుఁగూర్చినం
గాసునువెంటరాదు కని ♦ కానక చేసిన పుణ్యపాపముల్
వీసరబోవనీవు పది ♦ వేలకుజాలు భవంబునొల్లనీ
దాసునిగాఁగ నేలు కొను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 67

టీ. వాసవ=ఇంద్రునియొక్క, రాజ్య=దొరతనమును, భోగ=భోగముసు, సుఖ=సౌఖ్యములనెడి, వార్థిన్=సముద్రమందు, తేలుప్రభుత్వము=తేలునట్టి దొరతనము, అబ్బిన్=లభించినప్పటికిని, ఆసకున్, మేరలేదు=మితికలుగదు, కనకాద్రి=బంగారుకొండతోడ, సమాన=సమానమైన,ధనంబున్=ద్రవ్యమును, కూర్చినన్=సేకరించినను, కాసును=కాసుకూడ, వెంటరాదు, కని=తెలిసియు, కానక=తెలియకయు, చేసిన=చేసినట్టి, పుణ్యాపాపముల్, వీసరపోవ నీవు=వెలితిపడనియ్యావు, పదివేలకున్=పదివేల అనర్థములకును, చాలుక్=అవి చాలి యుండును, భవంబుక్=పుట్టుకను, ఒల్లన్=ఇష్టపడను, నీదానునిగాగ=నీ సేవకునిగా, ఏలుకొను=రక్షింపుము.

తా. రామా! ఇంద్ర భోగమును, ఇంద్రునియైశ్వర్యము గలిగినను, ఆశకు మితిలేదు బంగారుకొండంత ధనము కూర్చి పెట్టినను, పోవునపుడు ఒక కాసుకూడ వెంటరాదు. తెలిసియో తెలియకయో చేసిన పాపపుణ్యములు, చుట్టును చేరి కొంచెమైనను, తప్పించుకొనుట కవకాశమీయవు. మఱికొన్ని యనర్థములయినను కలిగింపజాలును. కనుక పుణ్యాపాపంబులు చేసి జన్మములెత్తుటకు నాకు యిష్టములేదు. నీదానునిగా చేపట్టి జన్మములేకుండఁ గాపాడుము.

ఉ. సూరిజనుల్ దయాపరులు ♦ సూనృతవాదులలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు ♦ విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁదాల్పఁగా జనులు ♦ పావనమైన పరోపకార స
త్కార మెఱుంగలేరకట ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 68

టీ. సూరిజనుల్=పండితజనులు, దయాపరులు=దయగలవారును, సూనృతవాదులు=సత్యము పలుకువారును, అలుబ్ధమానవుల్=లోభములేని

మనుష్యులును, వీరపతివ్రతాంగనలు=వీరత్వముతో పతివ్రతలగుస్త్రీలును, విప్రులు=బ్రాహ్మణులు, గోవులు వేదములు, మహీభారము=భూమియొక్క బరువును, తాల్చఁగాన్=భరింపగా, జనులు=సామాన్యులగు జనులు, పావనమైన=పవిత్రంబగుట, పరోపకార సత్కారము=పరోపకారమునకు సత్కరించుట, ఎఱుంగలేరు=తెలియలేరు, అక్కట=అయ్యో.

తా. రామా ! పండితులు, దయాళురు, సత్యసంధులు, లోభములేనివారు, వీరపతివ్రతలయిన స్త్రీలు, బ్రాహ్మణులు, గోవులు, వేదములు ఈభూజనులను ఉద్ధరించుచున్నవి. ఇట్టి ఉపకారులకు తక్కినజనులు ప్రత్యుపకారముచేసి పూజించుట ధర్మము. అయినను, అది జనులు తెలియకున్నారు.

ఉ. వారిచరావతారమున ♦ వారధిలోఁజొరబాఱి క్రోధవి
స్తారగుఁడై నయూనిగమ ♦ తస్కరవీరనిశాచరేంద్రునిం
జేరివధించివేదముల ♦ చిక్కెడలించి విరించికిన్ మహో
దారతనిచ్చి తీవెగద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 69

టీ. వారిచరావతారమునన్=మత్స్యావతారమునందు, వారధిలోన్=సముద్రములోనికి, చొరఁబాఱి=వేగముగావొచ్చి, క్రోధవిస్తార=మిగుల కోపమును, పొంది, నిగమ=వేదములయొక్క, తస్కర=దొంగిలించినవాఁడైన, వీర=వీరుడగు, నిశాచరేంద్రునిన్=సోమకాసురుని, చేరి=పొంది, వధించి=చంపి, వేదముల చిక్కు=వేదముల గజిబిజిని, ఎడలించి=తీసి, విరించికిన్=బ్రహ్మకు, మహోదారతన్=మిక్కిలి దాతృత్వముతో, ఈవె=నీవె, ఇచ్చితివికద=ఇచ్చినవాఁడవు గదా.

తా. రామా ! మత్స్యావతారమునందు సముద్రము నందుజొచ్చి మిక్కిలికోపాతిశయముతో వేదములను దొంగిలిం

చిన వీరుఁడైన మేటిరాక్షసుడగు సోమకాసురుని పట్టిచంపి వేద
ముల చిక్కువిడదీసి బ్రహ్మకు మరల వానిని మిక్కిలి యౌదా
ర్యముతో నిచ్చినవాఁడవు నీవేకాని మఱెవ్వరుగారు. అట్టి
నీవు నన్నును కాపాడఁదగును.

చ. కరమనురక్తి మందరము ♦ గవ్వముగాయహిరాజు త్రాడుగా
 దొరకొని దేవదానవులు ♦ దుగ్ధపయోధిమధించుచున్న చో
 ధరణిచలింప లోకములు ♦ తల్లడమందగ కూర్మమైధరా
 ధరము ధరిఁచితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 70

టీ. కరము=మిక్కిలి, అనురక్తిన్=అనురాగముతో, దేవ=దేవతలు, దానవులు=రాక్షసులు, మందరపర్వతమును, కవ్వముగా, అహిరాజు=సర్పరాజయినవానిని, త్రాడుగా, దొరకొని=పూని, దుగ్ధపయోధిన్=పాల సముద్రమును, మధించుచున్నచోన్=చిలుకుచుండగా, ధరణి=భూమి చలింపన్=వడకఁగా, లోకము=జగము, తల్లడమందగన్= తల్లడిల్లగా, కూర్మమై=తాబేలుఅయి, ధరాధరమున్=ఆ మందరపర్వతమును, యీవె=నీవె, ధరించితికద=ఎత్తితివికదా.

తా. రామా! దేవతలును, రాక్షసులును, మందరపర్వతమునుకవ్వముగాను, వాసుకిని కవ్వపు త్రాడుగాను, జేసి పాల సముద్రమును చిలుకుచుండగా, అపుడాకొండ తటాలున మునుగుటచేత భూమి, లోకములు, తల్లడిల్లుటఁజూచి కూర్మావతారమెత్తి కొండను వీఁపుమీఁదదాల్చినవాఁడవు నీవేకదా.

ఉ. ధారుణి చాపఁజుట్టిన వి ♦ ధంబునగైకొని హేమనేత్రుఁడ
 వ్వారధిలోన దాఁగినను ♦ వానివధించి వరాహమూర్తివై

ధారుణిఁదొంటికైవడిని ♦ దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 71

టీ. ధారుణిన్=భూమిని, చాపన్=చాపను, చుట్టినవిధంబునన్=మడచినతీరుగా, హేమనేత్రుడు=హిరణ్యాక్షుడు, కైకొని=చుట్టి ఎత్తుకొని అవ్వారధిలోనన్=ప్రసిద్ధమయిన సముద్రమునందు, డాగినను=దాచుకొనఁగా, వానిన్=అహిరణ్యాక్షుని, వధించి=చంపి, వరహమూర్తివై=పందియాకారముగలవాడవై, దక్షిణశృంగమునన్=కుడికొమ్మునందు, కుడిపంటికోఱయందు, ధరించి=తాల్చి, విస్తారము=మఱలచాపగా, ఈవె=నీవు ఒనర్చితికద=దయచేసితివికదా.

తా. రామా ! హిరణ్యాక్షుడు భూమినిచాఁపచుట్టగా చుట్టియెత్తుకొని సముద్రములోనికిఁబోయి దాఁచుకొనగా నీవు వానిని జంపి వరాహరూపమునుదాల్చి, కుడిపంటికోఱతో భూమిని యెత్తుకొనివచ్చి మునుపటివలె చాఁపగాతఱపునొందియుండునట్లు చేసినవాఁడవు నీవెకాని మఱెవ్వరును గారు. కనుక నన్నును అట్లనే ఉద్ధరింపుమా.

ఉ. పెటపెటనుక్కుకంబమున ♦ భీకరదంత నఖాంకురప్రభా
పటలము గప్ప నుప్పతిలి ♦ భండనవీధినృసింహభీకర
స్ఫుటపటుశక్తి హేమకశి ♦ పున్ విదళించి సురారిపట్టినం
తటఁ గృపఁజూచితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 72

టీ. ఉక్కుకంబమునన్=ఇనుపస్తంభమున, పెటపెట=పెటపెటమను, భీకరదంత=భయంకరపండ్ల, నఖాంకుర=గోటిమొనల, పటలము=సమూహము, వీధన్, కప్పన్=కప్పుకొనగా, ఉప్పతిలి=పుట్టి, భండన=యుద్ధమున నృసింహా=నరసింహావతారముయొక్క, భీకర=భయంకరమైన, స్ఫుట=స్ప

ష్టమైన, పటు=పటువైనదగు, శక్తిన్=సామర్థ్యము చేత, హేమకశిపున్= హిరణ్యకశిపుని, విదలించి=చీల్చి, అంతటన్=పిమ్మట, సురారిపట్టిన్= ప్రహ్లాదుని, కృపన్=దయతో, ఈవె=నీవె, చూచితికద=చూచితివికదా.

తా. రామా! నీవు ఉక్కు స్తంభమున పెటపెటమని నరసింహమూర్తివై పుట్టి నీపండ్లతో గోళ్ళతో తెల్లనికాంతులు నిన్ను గ్రమ్మ భయంకర శక్తిచే హిరణ్యకశిపుని బొమ్ముచీల్చి చంపి ప్రహ్లాదునిఁ గాపాడినావు. నన్నుగూడ కాపాడుము.

చ. పదయుగళంబు భూగగన ♦ భాగములన్ వెసనూనివిక్రమా
స్పదమగు నబ్బలీంద్రునొక ♦ పాదమునందల క్రిందనొత్తిమే
లొదవజగత్రయంబుబురు ♦ హూతునకియ్యవటుండవైనచి
త్సదమలమూర్తి వీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ.73

టీ. పదయుగళంబు=పాదములజంటను, భూ=భూమియొక్కయు, గగన=ఆకాశముయొక్కయు, భాగములన్=ప్రదేశములందు, వెసన్=శీఘ్రముగా, ఊని=నిలిపి, విక్రమ=పరాక్రమములకు, ఆస్పదము=స్థానము, అగు నబ్బలీంద్రున్=అయినట్టి ఆబలిచక్రవర్తిని, ఒకపాదమునన్=ఒకకాలిచే, క్రిందన్=క్రిందుగా, తలన్=తలను, ఒత్తి=అదిమి, మేలు=శ్రేయస్సు, ఒదవన్=కలుగగా, పురుహూతునకున్=ఇంద్రునకు, జగత్రయంబున్=లోకములమూటిని, ఇయ్యన్=ఇచ్చుటకు, వటుండవు=వడుగవు, ఐన, చిత్=జ్ఞానమును, సత్=ఉనికియు లేక సత్యమును అయిన, అమల=నిర్మలయగు, మూర్తివి=విగ్రహముకలవాడవు, నీవెకదా=నీవేకాదా.

తా. భూమియందు ఆకాశమునందు నొక్కొక్కపాద మునుంచి మహాపరాక్రమవంతుడైన బలిచక్రవర్తి తలమీఁద నొకపాదముపెట్టి పాతాళమునకు అణగద్రొక్కి మేలగునట్లు

ముల్లోకములను ఇంద్రునకు యిచ్చుటకై పటువుగా బుట్టిన సచ్చిదానందమూర్తి నన్నుఁగాపాడుమా.

చ. ఇరువదియొక్కమాఱు ధర • నీశుల నెల్లవధించి తత్కళే
బర రుధిర ప్రవాహమున • బైతృకతర్పణ మొప్పజేసిభూ
సురవరకోటికిన్ ముదము • సొప్పడభార్గవరామమూర్తివై
ధరణినొసంగితీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 74

టీ. ఇరువదియొక్కమాఱు, ధరణీశులన్=రాజులను, ఎల్లన్=అందఱిని, వధించి=చంపి, తత్=వారి, కళేబర=దేహముల, రుధిర ప్రవాహమునన్=నెత్తుటితో, పైతృకతర్పణము=పితరులకు జలతర్పణము, ఒప్పన్=చేసి, భూసురవరకోటికిన్=బ్రాహ్మణులకు, ముదము=సంతోషము, చొప్పడన్=కలుగ, భార్గవరామమూర్తివై=పరశురాముడవై, భూమిని, ఈవె=దానము చేసితివికదా.

తా. రామా! రాజులనందరిని ఇరువదియొక్క పర్యాయములుచంపి, వారిదేహముల నెత్తుటివెల్లువలచేత పితరులకు జలతర్పణమిచ్చి వారియొద్దనుండి జయించినభూమిని బ్రాహ్మణసమూహమునకు సంతోషము కలుగునట్లు దానముచేసిన పరశురాముఁడవు నీవేయగుదువు.

చ. దురమునఁదాటకందునిమి • ధూర్జటివిల్ దునుమాడిసీతనుం
బరిణయమంది తండ్రిపను • పన్ ఘనకాననభూమికేఁగిదు
స్తరపటుచండ కాండ కులి • శాహతిరావణకుంభకర్ణభూ
ధరములఁ గూల్చితీవెకద • దాశరథీ కరుణాపయోనిధీ. 75

టీ. దురమునన్=యుద్ధమున, తాటకను, దునిమి=చంపి, ధూర్జటివిల్=శివునివిల్లు, దునుమాడి=విఱిచి, సీతనున్=సీతాదేవిని, పరిణయ

మంది=పెండ్లాడి, తండ్రి, పనుపన్=అడవికి పంపగా, ఘన=గొప్పదైన కాననభూమికిన్=అరణ్యప్రదేశమునకు, ఏగి=పోయి, దుస్తర=కడవరాని దియు, పటు=పటుత్వముగలదియు, చండ=తీక్ష్ణమైనదియు, అగు, కాండ=బాణమనెడి, కులిశ=వజ్రముయొక్క, ఆహతిన్= దెబ్బచేత, రావణకుంభకర్ణ=రావణుడు కుంభకర్ణుడు అను, భూధరములన్=కొండ లను, ఈవె=నీవె, గూల్చితికద=కూలవైచితివి కదా.

తా. రామా! యుద్ధమున తాటకనుజంపి, శివునివిల్లు విఱచి, సీతను పెండ్లాడి, తండ్రి పంపఁగా కాఱడవికిపోయి వజ్రా యుధముచేత కొండలను గూల్చునట్లు వారింపరాని వాఁడిబాణ మున రావణకుంభకర్ణులను గూల్చినవాఁడవు నీవె యగుదువు.

చ. అనుపమయాదవాన్వయసు ♦ ధాబ్ధిసుధానిధికృష్ణమూర్తినీ
కనుజుఁడుగాజనించి కుజ ♦ నావళినెల్ల నడంచి రోహిణీ
తనయుఁడనంగ బాహుబల♦దర్పమునన్ బలరామమూర్తివై
తనరినవేల్పవీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 76

టీ. అనుపమ=సాటిలేని, యాదవాన్వయ=యాదవవంశము అనెడి, సుధాబ్ధి=పాలసముద్రమునకు, సుధానిధి=చంద్రుడగు, కృష్ణమూర్తి=కృష్ణుడు, నీకు అనుజాడుగాన్=తమ్ముడుగా, రోహిణీతనయుడు అనంగన్=రోహిణీ దేవి కుమారుఁడు అని జనులాడఁగా, జనించి=పుట్టి, బాహుబల=భుజముల బలిమి చేతనైన, దర్పమునన్=గర్వముచేత, కుజనావళిన్, ఎల్లన్=దుష్టుల సమూహమును అంతయు, అడంచి=అడఁగద్రొక్కి, బలరామమూర్తివై= బలరామావతారమెత్తినవాఁడవై, తనరినవేల్పవు=ఒప్పునట్టి దేవుండవు, ఈవెకద=నీవెకదా.

తా. రామా యాదవవంశ తిలకుఁడైన కృష్ణుఁడుతమ్ము డుగా రోహిణీదేవికడుపునఁబుట్టి భుజబలాతిశయముచేత, దుష్ట

సమూహములనెల్ల రూపుమాపి బలరాముఁడుగా నవతరించిన దేవుఁడవు నీవేయగుదువు.

చ. సురలునుతింపఁగాఁ ద్రిపుర ♦ సుందరులన్ వరియింపబుద్ధరూ
పరయఁగఁదాల్చితీవు త్రిపు♦ రాసురకోటి దహించునప్పుడా
హరునకుఁదోడుగా వరశ ♦ రాసన బాణముఖోగ్రసాధనో
త్కరమొనరించితీవుకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 77

టీ. అరయఁగన్=విచారింపఁగా, సురలు=దేవతలు, నుతింపగాన్=పొగడఁగా, త్రిపురసుందరులన్=త్రిపురములందలి స్త్రీలను, వరియింపన్=వరించుటకై, బుద్ధరూపు=బౌద్ధరూపము, ఈవు=నీవు, దాల్చితి=ధరించితివి, త్రిపుర=త్రిపురములలో వసించు, అసురకోటిన్=రాక్షససమూహమును, దహించునప్పుడు, ఆహరునకున్=ఆశివునకు, తోడుగాన్=సాహాయ్యముగా, వర=శ్రేష్ఠమైన, శరాసన=విల్లు, బాణ=బాణము, ముఖ=మొదలయిన, ఉగ్ర=భయంకరమగు, సాధన=పరికరముయొక్క, ఉత్కరము=సమూహము, ఈవే=నీవే, ఒనర్చితివికదా=చేసితివిగావా.

తా. దేవతలు ప్రార్థింప త్రిపురస్త్రీలను వరింపఁ బౌద్ధవిగ్రహము దాల్చినవాఁడవు నీవే ఆ త్రిపురాసురుల కాల్చునప్పుడు శివునికివిల్లు అమ్ము మొదలయిన సాధనములను సవరించి సాహాయ్యము చేసినవాఁడవు నీవే. ఇట్లు దుష్టులను నిగ్రహించి శిష్టులను రక్షించు నీవు నన్ను రక్షింపుమా.

ఉ. సంకరదుర్గమైదురిత ♦ సంకులమైన జగంబుజూచి స
ర్వాంకషలీల నుత్తమ తు ♦ రంగమునెక్కి కరాసిబూని వీ
రాంకవిలాస మొప్ప గలి ♦ కాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చితీవుకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 78

టీ. సంకర=వర్ణసంకరముచేత, దుర్గమై=ప్రవేశింపరానిదై, దురిత=పాపముచేత, సంకులము=వ్యాపించినది, ఐనజగంబు=అయినట్టి లోకమును, చూచి, సర్వంకష=అన్నిటిని ఒరయుచున్న, లీలన్=విలాసముతో, ఉత్తమతురగము=మేలయినగుఱ్ఱమును, ఎక్కి, కరాసిన్=చేతికత్తిని, పూని=తాల్చి, వీరాంక విలాసము=వీరాంకవీరుండనుట, పరాక్రమును, ఒప్పుచుండగా, కలికాకృతిన్=కల్కి-ఆకారముతో, సజ్జనకోటికిన్=సత్పురుష సమూహమునకు, నిరాటంకము=ఆటంకములేమి, ఈవె=నీవె, ఒనర్చెదు కద=చేయబోయెదవుకదా.

తా. రామా ! వర్ణసంకరము మిక్కిలిబలీయమయి పాపము నిండియున్న జగమునుజూచి మిక్కిలి లీలతో గొప్ప గుఱ్ఱమునెక్కి చేతకత్తిదాల్చి పరాక్రమము విలాసము మెఱయంగా కల్కిమూర్తివై సజ్జనులకు దురాచారవర్ణ సంకరాది ప్రతిబంధకములు లేకుండునట్లు ఇంక చేయగలవాడవు నీవే యగుదువు

చ. మనమునసూహపోహణలు♦మర్వకమున్నె కఫాదిరోగముల్
దనువుననంటి మేనిబిగి ♦ దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపఁగావలయు♦దత్వవిచారము మానియుండుట
ల్తనువునకున్ విరోధమిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 79

టీ. మనమునన్=మానసమందు, ఊహపోహణలు=ఊహాపోహలు, మర్వకమున్నె=మరుపక మునుపే, కఫాదిరోగముల్=కఫము మొదలగు తెవుళ్ళు, తనువు=శరీరమందు, అంటి=కలిగి, మేనిబిగి=శరీరపటుత్వము, తప్పకమున్నె, నరుండు=మనుష్యుడు, మోక్షసాధనము=మోక్షమార్గమున కుపాయము ఒనరింపవలయును=చేసికొనవలయును, తత్వ=వస్తువులరూపును, విచారము=పరిశీలనము, మానియుండుటల్=వదలియుండు కార్యములు, తనువునకున్=శరీరము, విరోధము=విరుద్ధమైనది.

తా. రామా మానసంబున నూహించు శక్తియుఁ దలంచుకొను శక్తియు నశింపక మునుపే కఫము మొదలైన రోగములు శరీరమున వ్యాపించి శక్తితప్పక మునుపే మనుష్యుఁడు తత్వవిచారముచేసి మోక్షమున కుపాయము వెదుకవలెను. పిదపచేసికొనుట కశక్యము. తత్వవిచారము సేయకుండుట ఆత్మస్వరూపమునకు విరుద్ధమగును.

చ. ముదమునకాటపట్టుభవ ♦ మోహమదద్విరదాంకుశంబుసం
పదలకొటారు కోరికల ♦ పంట పరంబునకాది వైరుల
న్నదనజయించుత్రోవ విప ♦ దబ్ధికినావగదా సదాభవ
త్సదమలనామసంస్మరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 80

టీ. భవత్=నీ, సదమల=నిర్మలమైన, నామసంస్మరణ=పేరుస్మరించుట, ముదమునకున్=సంతోషమునకు, ఆటపట్టు=స్థానము, భవ=పుట్టుకయును, మోహ=అజ్ఞానము అనెడి, ద్విరద=ఏనుగులకు, అంకుశంబు=అంకుశము, సంపదలకొటారు=సంపదలకొట్టు, కోరికలపంట=కోరికలపంట, పరంబునకున్=పరలోకమునకు, ఆది=మొదలు, వైరులన్=శత్రువులను, అదనన్=సమయముజూచి, జయించుత్రోవ=గెలుచుమార్గము, విపదబ్ధికిన్=ఆపత్సముద్రమునకు, నావగదా=ఓడగును.

తా. రామా! నిర్మలమైన నీనామమును స్మరించుటసంతోషముకలిగించును. అంకుశముచే ఏనుఁగును అణఁచునట్లు మొడతెగకయుండుజన్మ పరంపరను అణఁచును. సకలసంపదలను యిచ్చును. కోరికలనెల్ల సఫలముగావించును. సర్వలోకములకు మూలము. పగవారిని గెలుచుటకు సాధనమైనది. సముద్రమును దాటించు నోడవలె ఆపదలను పోగొట్టును.

చ. దురితలతానుసారభవ ♦ దుఃఖకదంబము రామనామ భీ
కరతర హేతిచేఁ దెగి వ ♦ కావకలై చనకుండ నేర్చునే
దరికొని మండుచుండు శిఖి ♦ దార్కొ-నినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 81

టీ. దురిత=పాపమనెడి, లత=తీగను; అనుసార=అనుసరించుచున్న, భవ=పుట్టుకలనెడి, దుఃఖకదంబము=దుఃఖసమూహము, రామనామ=రామనామము అనెడి, భీకరతర=మిక్కిలి భయంకరమైన, హేతిచేన్=కత్తిచేత తెగి, వకావకలై=భిన్నభిన్నమై, చనకుండ నేర్చునే=పోవకుండ జాలునా, దరికొని=తగులుకొని, మండుచుండుశిఖిన్=జ్వలించుచున్న అగ్నిని, దార్కొనినన్=మీదపడగా, శలభ=మిడుతలు, ఆది=మొదలైన, కీటక=పురుగుల, ఉత్కరము=సమూహము, విలీనమై=మిక్కిలి అడగిపోయినదై, చనదె=పోదా, నశించియే పోవునని భావము.

తా. రామా! పాపము పయిపయిరాఁగా దానితోఁ గూడ సాఁగు దుఃఖాత్మకమైన జన్మ పరంపర, కత్తిచేత తీఁగ త్రెంపబడునట్లు, నీరామనామముచేత నశించి పటాపంచలై, రగిలిమండుచున్న అగ్నియందుబడిన మిడుతలు మొదలైన పురుగులవలె రూపుమాసిపోవును.

చ. హరిపదభక్తినింద్రియజ♦యాన్వితుఁడుత్తముఁడింద్రియంబు
లన్। పరగకనిల్పఁనూదినను ♦ మధ్యముఁ డింద్రియపారవ
శ్యుఁడై । పరగిన-చోనికృష్టుడని♦ పల్కగదుర్మతినై ననన్ను నా
దరమున నెట్లుకాచెదవో ♦ దాశరథీ కరుణాపయోనిధీ.82

టీ. హరిపదభక్తి=విష్ణుపాదములందలి భక్తిచేత, ఇంద్రియ=ఇంద్రియములను, జయ=గెలుచుటతోడ, అన్వితుఁడు=కూడినవాఁడు, ఉత్తముఁడు=

శ్రేష్ఠుఁడు, ఇంద్రియంబులన్=ఇంద్రియములందు, మరుగక=లీనుఁడుగాక నిల్పన్ దానిని నిగ్రహించుటకు, ఊదినను=ప్రయత్నించినయెడల, మధ్యముఁడు=నడితరపువాఁడు, ఇంద్రియ=ఇంద్రియములకు, పారవశ్యుడై=అధీనుఁడై, పరగినచోన్=ప్రసరించినయెడల, నికృష్టుఁడు=అధముఁడు, అని, పల్కగన్=చెప్పఁగా, దుర్మతిని=దుష్టబుద్ధిని, ఆదరమునన్=ఆదరముతో, ఎట్లుకాచెదవో=ఎట్లుకాపాడెదవో.

తా. రామా! విష్ణుపదభక్తితో ఇంద్రియములను గెలిచినవాడు ఉత్తముడు. ఇంద్రియములకులోనుగాక నిగ్రహింప ప్రయత్నించువాఁడు మధ్యముఁడు. ఇంద్రియములకు ఆధీనుఁడైనవాఁడు అధముఁడు. ఈముగ్గురలో దుష్టబుద్ధినైన నేను అధముఁడను. గనుక రక్షింపదగినవాడనుగాను, అయినను నన్నెట్లు రక్షించెదవో తెలియదు.

చ. వనకరిచిక్కె మైనసకు ♦ వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁజిక్కెఁజిల్వగను ♦ వేఁదుఱు జెందెను లేళ్ళు తావిలో
మనికినశించెదేటి తర ♦ మాయిరుమూఁటిని గెల్వనైదు సా
ధనముల నీవె కావఁదగు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 83

టీ. వనకరి=అడవిఏనుగు, మైనసకున్=శరీరచాపల్యమునకు, (కరులపట్టువాండ్రాకర్షణమునకై విడచు ఆడు ఏనుగను కామించి) చిక్కెన్=చిక్కుబడెను, మీను=చేఁప, వాచవికిన్=నోటిరుచికి, (గాలమందుగ్రుచ్చిన యెఱ్ఱరుచికి) చెడిపోయెన్=తగులుపడెను, చిల్వ=పాము, తాన్=తాను, వినికికిన్=వినుటకు, (పాములవాఁడు ఊదు నాగస్వరమును వినుటకు) చిక్కె=చిక్కుపడెను, లేళ్ళు, కనువేఁదురున్=కంటిపిచ్చి, చెందును=పొందును,(కన్నులింద్రియములకు లోనయ్యె) తేఁటి=తుమ్మెద, తావిలో=వాసనలో, మనికిన్=ఉండుటవలన, నశించెను, ఇరుమూఁటిని=ఐదింటిని

(ఐదింద్రియములను) చెల్వన్=జయించుటకు, తరమా=శక్యమా, ఐదు సాధనములన్=పంచవిధోపాయములచేత, నీవె కావఁదగున్=నీవే కాపాడవలయును.

తా. దాశరథీ! అడవిలో ఏనుఁగు ఆఁడు ఏనుఁగునుం గనియు, చేఁప గాలమందలి యెరచవికిని, పాము, పాములవాని ఊదుస్వరమును వినుటకును, లేడి కనుపిచ్చిచేతను, తుమ్మెద తామరలోని వాసనకును చిక్కుకొనుచున్నవి. పంచేంద్రియముల నిన్నుఁగొల్చు పంచవిధకైంకర్యములచేత యింద్రియముల నడఁచి నన్ను కాపాడుము.

చ. కరములుమీకుమ్రొక్కులిడ ◆ గన్నులుమిమ్మునెచూడజిహ్వ
మీస్మరణదనర్పవీనులు ◆ భవత్కథన్వినుచుండ నాసమీ
యఱుతనుబెట్టు పూసరుల ◆ కాస గొనంబరమార్థసాధనో
త్కరమిదిచేయవేకృపను ◆ దాశరథీ కరుణాపయోనిధీ. 64

టీ. కరములు=చేతులు, మీకున్, మ్రొక్కులిడన్=దండములు పెట్టగాను, కన్నులు, మిమ్మునె, చూడన్=చూడఁగాను, జిహ్వ=నాలుక, మీస్మరణన్=మిమ్ముస్మరించుటచేత, తనర్పన్=ఒప్పఁగాను, వీనులు=చెవులు, భవత్ కథల్=మీదైన చరిత్రములను, వినుచుండన్=వినుచుండఁగాను, నాసిక=ముక్కు, మీయఱుతను=మీమూఁపునందు, పెట్టుపూలసరులన్=పెట్టునట్టి పూవుదండలకు, ఆసగొనన్=ఆసపడఁగాను, అది=అట్లు ఆయా అవయవములు మీకు ఆయాకార్యములు సేయుట, పరమార్థసాధన=పురుషార్థములను సాధించెడి యుపాయముయొక్క, ఉత్కరము=సమూహము.

తా. చేతులుమీకు మ్రొక్కుటయు, కన్నులుమిమ్ము చూచుటయు, నాలుక మీనామమును జపించుటయు, చెవులు

మీకథలను వినుటయు, ముక్కు మీమూపునందలి పూదండ లను కోరుటయుననెడి యీయైశ్వర్యములే మోక్షమునకు సిద్ధికరమైన సాధనములు.

చ. చిరతరభక్తినొక్కతుల ♦ సీదళ మర్పణసేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖ ♦ సంఘములోఁ వెలుఁగన్ సదాభవ
త్స్ఫురదరవింద పాదములఁ ♦ బూజలొనర్చినవారికెల్ల ద
త్పరమరచేతిధాత్రిగద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 85

టీ. చిరతరభక్తిన్=బహుకాలముగానున్న భక్తితో, ఒక్కతులసీదళం=ఒక్కతులసియాకు, అర్పణసేయువాఁడు=సమర్పించువాఁడు, ఖేచరులు=గరుడులు ఉరగులు అను వీరియొక్క సమూహములోపల, వెలుఁగున్=ప్రకాశించును, సదా=ఎల్లప్పుడును, భవత్=నీయొక్క, స్ఫురత్=ప్రకాశించుచున్న, అరవింద=తామరలవంటి, పాదములన్=అడుగులను. పూజలు ఒనర్చినవారికెల్లన్=పూజించినవారి కందరికిని, తత్పరము=ఆమోక్షము, అరచేతిధాత్రి=అరచేతి యుసిరికవలె, సదా అగును.

తా. రామా! బహుకాలము భక్తితోడ ఒక్కతులసిదళమును నీకు సమర్పించినవాఁడు ఖేచరులు, గరుడులు, ఉరగులు అనువీరిలో నొక్కఁడై ప్రకాశించును. ఇఁక యెప్పుడును, నీపాదారవిందములను బూజసేయు వారికందరికి మోక్షము కరతలామలకమేకదా.

ఉ. భానుఁడుతూర్పునందుగను ♦ పట్టినఁ బావకచంద్రతేజముల్
హీనతజెందినట్లు జగ ♦ దేక విరాజితమైన నీపద
ధ్యానముసేయుచున్నఁ బర ♦ దైవమరీచులడంగకుండునే
దానవ గర్వనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 86

టీ. దానవ=రాక్షసులయొక్క, గర్వ=గర్వమును, నిర్ఘళన=హరించు వాఁడా, భానుఁడు=సూర్యుఁడు, తూర్పునందున్=తూర్పుదిక్కునందు, కను పట్టినన్=కనుపడఁగా, పావక=అగ్ని యొక్కయు, చంద్ర=చంద్రునియొక్కయు, తేజముల్=కాంతులు, హీనతచెందినట్లు, జగదేక=లోకమునకు ముఖ్యముగా, విరాజితము=ప్రకాశించునది, ఐన నీపదధ్యానము=అయినట్టి నీపదధ్యానమును, చేయుచున్నన్=చేయుచుండఁగా, పరదైవమరీచులు=ఇతరదైవములకాంతులు, అడంగకుండునే=అణఁగిపోకుండునా.

తా. సూర్యునికాంతికి అగ్నిమొదలగువాని కాంతులడంగునట్లు జగత్తంతయు ప్రకాశించుచున్న నీపదధ్యానముయొక్క ప్రకాశమునకు ఇతరదేవతల ప్రకాశములు అడఁగిపోవును.

ఉ. నీమహనీయతత్త్వరస ♦ నిర్ణయబోధ కథామృతాబ్ధిలోఁ
బామును గ్రుంకులాడక వృ ♦ థాతనుకష్టము జెందిమానవుం
డీమహిలోకతీర్థముల ♦ నెల్లమునింగిన దుర్వికార హృ
త్తామసపంకముల్ విడునె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 87

టీ. మహనీయ=గొప్పదైన, తత్త్వరస=తత్త్వసారముయొక్క, నిర్ణయ=నిశ్చయముగల, బోధ=జ్ఞానము కలిగిన, కథా=కథలనెడి, అమృతాబ్ధిలోన్=అమృతమైన సంద్రమందు, తాన్=తాను, మును=ముందు, క్రుంకులాడక=మునుఁగక, వృథా=వ్యర్థంబుగా, తనకష్టమున్=శరీరసంకటమును, చెంది=పొంది, మానవుండు=మనుష్యుఁడు, ఈమహిలోక=యీభూలోకమందలి, తీర్థములెల్లన్=తీర్థములందంతటను, మునిగినన్=క్రుంకఁగా దుర్వికార=చెడువికారములుగల, హృత్=హృదయముయొక్క, తామస=తమోగుణ సంబంధమైన, పంకముల్=బురదలు, విడునె=విడిపోవుగదా.

తా. రామా ! నీమాహాత్మ్యముయొక్క స్వారస్యమిట్టిదని నిర్ణయించితెలుపు నీదివ్యచరిత్రమనెడి అమృత సముద్ర

మునందు గ్రుంకులిడినవో దుర్వికారమైన హృదయమందలి తామసగుణలనెడి రొంపులుతీసిపోవునుగాని కేవలము ఈ భూలోకమునందలి తీర్థములందు మునింగినయెడల అవితీసిపోవు.

ఉ. కాంచన వస్తుసంకలిత ♦ కల్మష మగ్నిపుటంబు బెట్టి వా
రించినరీతి నాత్మనిగి ♦ డించిన దుష్కర దుర్మలత్రయం
బంచితభక్తియోగదహ ♦ నార్చిఁ దగుల్పక పాయునే కన
త్కాంచనకుండలాభరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 88

టీ. కనత్=ప్రకాశించుచున్న, కాంచన=బంగారమయమైన, కుండల=కుండలములు, ఆభరణ=సొమ్ముగాఁగలవాఁడు, కాంచనవస్తు=బంగారుపదార్థమునందు, సంకలిత=మిక్కిలి తగిలిన, కల్మష=మాలిన్యము, అగ్నిపుటంబు పెట్టి=అగ్నిపుటము వేసి, వారించినరీతిన్=తొలగించిన విధమున, దుష్కర=చేయరాని, దుర్మలత్రయంబు=చెడ్డవియైన మూడుమలములను, అంచిత=ఒప్పుచున్న, భక్తియోగమనెడి, దహన=అగ్నియొక్క, అర్చిన్=జ్వాలయందు, తగుల్పక, పాయునే=విడిచిపోవునా?

తా. రామా! బంగారులోని మాలిన్యము అగ్నిపుటమువలన పోవునట్లు ఆత్మయందుగల మూఁడుమలములు నీయందలి భక్తియోగముచేతనే నశించునుగాని మఱొకవిధమున నశింపవు.

ఉ. నీసతి పెక్కుగల్మలిడ ♦ నేర్చరిలోక మకల్మషంబుగా
నీసుతసేయు పావనము ♦ నిర్మితకార్యధురీణ దక్షుఁడై
నీసుతుడిచ్చు నాయువును ♦ నిన్నుభజించినఁ గల్గకుండునే
దాసులకీప్సితార్థములు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 89

టీ. నీసతి=నీభార్య, పెక్కుకల్మలు=అనేకసంపదలు, ఇడన్=ఇచ్చుటకు, నేర్పరి=నిపుణురాలు, నీసుత=(నీపాదములందు బుట్టుటచే) నీకూతురైన గంగ, లోకము=జగము, అకల్మషంబు గాన్=నిర్దోషమగునట్లుగా, పావనము సేయున్=పవిత్రముగా జేయును, నీసుతుడు=నీ కొడుకయిన, బ్రహ్మనిర్మితకార్య=నిర్మాణకృత్యముయొక్క, ధురీణ=భారముకల, దక్షుఁడై=నేర్పరియై, ఆయువులు=ఆయుష్యములు ఇచ్చును, నినున్=ఇట్టి నిన్ను, భజించినన్=కొలువఁగా, దాసులకున్=నీభక్తులకు, ఈప్సిత=కోరికలు, కలుగకుండునే=లభింపకపోవునా ?

తా. రామా! నీభార్యయైనలక్ష్మి సమస్తసంపదలనిచ్చుటకు నిపుణురాలు. నీకూతుఁరైన గంగ ముల్లోకములయందును ప్రవహించి యీలోకములందలి దోషములను పోఁగొట్టి పవిత్రముగాఁజేయును. నీకొడుకైన బ్రహ్మ సృష్టికార్యమంతయు నిర్వహింప సమర్థుఁడై ఆయువులనిచ్చును. ఇట్టిపుత్రకళత్రాదులుగల నిన్ను భజించిన నీభక్తులకు కోరిన కోర్కులు నెఱవేరక పోవు.

ఉ. వారిజపత్రమందిడిన ♦ వారివిధంబున వర్తనీయమం
దారయ రొంపిలోన దను ♦ వంటని కుమ్మరపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచువి♦ చారగుఁడై పరమొందుగా దెస
త్కారమెఱింగిమానవుఁడు ♦ దాశరథీకరుణాపయోనిధీ 90

టీ. వారిజపత్రమందు=తామరాకునందు, ఇడినవారివిధంబునన్=ఉంచిన జలమురీతిని, ఆరయన్=విచారింపఁగా, రొంపిలోనన్=బురదయందు, తనువు=దేహము, అంటని కుమ్మరపుర్వురీతిన్=తగులుకొనిన కుమ్మరపురుగువిధమునను, సంసారమందు, మానవుఁడు=మనుష్యుఁడు, మెలంగుచున్=ప్రవర్తించుచు, విచారగుఁడై=తత్వవిచారమును పొందినవాఁడై,

సత్కారము=పూజ, (నిన్ను పూజించుటకు) ఎఱింగి=తెలిసి, పరముఁ=మోక్షమును, ఒందుఁ గాదె=పొందునుగదా.

తా. రామా ! తామరాకునందలి నీటిబొట్టు ఆతామరాకును యెట్లు అంటుకొనదో, రొంపిలో కుమ్మరపురుగు మెలగినను దాని దేహమునకు బురద అంటుకొనక యెట్లుండునో, అట్లే పురుషుఁడై నవాఁడు సంసారమందు ప్రవర్తించుచుండినను తత్వవిచారమునుపొంది సంసారముని తగులుబడక మోక్షమును పొందును

చ. దొరసినకాయములుమ్మదిమిఁ తోఁచినఁజూచి ప్రభుత్వములుస్సిరు
లమెఱపులుఁగాగజూచిమఱిఁ మేదినిలోఁ దమతోడివారుముం
దరుగుటజూచిచూచి తెగుఁ నాయువెఱుంగక మోహపాశము
ల్దరుగనివారికేమిగతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 92

టీ. దొరసినకాయముల్=కలిగిన దేహములు, ముదిమి=ముసలితనము, తోఁచినన్=తోఁపఁగా చూచి, ప్రభుత్వముల్=దొరతనములు, సిరులు=సంపదలు, మెఱపులుగాఁగన్=మెఱుపుతీఁగలవలె, చూచి=తెలిసికొని, మఱి=మఱియు, మేదినిలోఁ=భూమియందు, తమతోడివారు=తమతోఁగూడ పుట్టిపెరిగినవారు, ముందు=(తమకు) మునుపు, అరుగుట=పోవుటను, (చచ్చుటను) చూచిచూచి, తెగు ఆయువున్=నశించునట్టి ఆయుష్యమును, (ఆయువునశించిపోవునని) ఎఱుంగక=తెలిసికొనక, మోహపాశములు=అజ్ఞానపుత్రాళ్ళు (ప్రపంచవిషయములందు త్రాళ్ళవలె బంధించు అజ్ఞానము), తఱుగనివారికిన్=తగ్గనివారికి, ఏమిగతి=ఏమిదిక్కు.

తా. రామా ! శరీరములుముదిసిపోవుటచేతను దేహము అస్థిరమనియు ప్రభుత్వాదులు నశించుటచే సంపదలు అస్థిరమనియు, తమ తోడివారు ముందుగానే చచ్చియుండుటచే తా

మును చావవలసినవారనియు చక్కఁగా తెలియుచుండినను ఆయువు నశించునని తెలియక అస్థిరములైన యీదేహాదుల యందే అజ్ఞానముయొక్క పాశములచే కట్టుబడుచున్నారే, ఇట్టివారికిఁ గలుఁగఁగలస్థితి యేమి? యని భావము.

చ. సిరిగలనాఁడు మైమఱచి ♦ చిక్కిననాఁడు దలంచి పుణ్యముల్
పొరిఁబొరిఁ జేయనైతినని ♦ పొక్కినఁ గల్గునె గాలిచిచ్చుపైఁ
గెరలినవేళఁ దప్పికొని ♦ కీడ్పడువేళ జలంబు గోరి త
త్తరమునఁ ద్రవ్వినం గలదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 13

టీ. శిరి=సంపద, కలనాఁడు=కలిగియుండినదినములందు, మైమఱచి=దేహము తెలియుటతప్పి, చిక్కిననాఁడుఁ=దరిద్రముచేచిక్కుపడిన దినములందును, తలంచి=ఆలోచించి, పుణ్యములు=పుణ్యకార్యములను, పొరిఁ పొరిఁ=మాటిమాటికి, చేయనైతిని అని=చేయకపోతిని అని, పొక్కినన్=తపించుగా, కల్గునె=ఫలము గలుగునా? (ఇందులకు దృష్టాంతరము) గాలి, చిచ్చుపై=అగ్గిమీద, కెరలినవేళఁ=విజృంభించినప్పుడు, (ఇల్లుమొదలగు వానిని కాల్పబూనిన అగ్నిపుట్టినప్పుడే చల్లార్పక దానిపై గాలి తగిలి మిక్కిలి రగులుకొన్న సమయమున) దప్పికొని, కీడ్పడువేళన్=స్రుక్కుడు సమయమందును, జలంబుఁ=నీటిని, కోరి=ఆశించి, తత్తరమున=తడఁబాటుతో, త్రవ్వినన్=భూమిలో త్రవ్వఁగా, కలదే=నీళ్ళుకలుగునా?

తా. సంపద యుండినకాలమందు, సంపదచే మత్తిల్లి ఒడలుమఱచి యుండి దారిద్ర్యము వచ్చిన వెనుక ఆలోచించి పుణ్యకార్యములు మాటిమాటికి చేయకపోతినే యని చింతించుట, గాలిచే మిక్కిలి రేగిన నిప్పును ఆర్పుటకును బాగా దప్పికొనినపుడు జలమునకై భూమినివేగిరపడి త్రవ్వుటయెటో అట్లే వ్యర్థమగును.

ఉ. జీవనమింకఁ బంకమున ♦ జిక్కినమీను చలింపకెంతయున్
దావుననిల్చి జీవనమె ♦ తద్దయుఁ గోరువిధంబు చొప్పడం
దావలమైనఁగానిగుఱి ♦ తప్పనివాఁడు చరింపువాఁడయా
తావకభక్తియోగమున ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 94

టీ. జీవనము=నీళ్ళు, ఇంకన్=ఇంకిపోఁగా, పంకమునన్=బురద యందు, చిక్కినమీను=చిక్కుపడినచేఁప, ఎంతయున్=ఎంతమాత్రమును, చలింపక=కదలక, తావునన్=దానున్నచోటనే, నిల్చి=ఉండి, జీవనమె=నీటినే, తద్దయున్=మిక్కిలి, కోరువిధంబు=కోరునట్టిరీతి, చొప్పడన్=కలుగునట్లుగా, తావలమైనదానిన్=స్థానమైన, దానిని=తనకు ఆధారమైన దానిని, గుఱితప్పనివాఁడు=నూటిచెడనివాడు, (తనకు ఆధారభూతమైన నీయందే గుఱియుంచి అగుఱినితప్పక నిన్నే ధ్యానించుచుండువాడు.) తావకభక్తియోగమునన్=నీదైన భక్తితోడి కూడికచే, తరించువాడయా=సంసారమును దాటువాడు అయ్యా !

తా. చేఁప నీళ్ళు యెండిపోయినను బురదలో చిక్కుకొన్నను, ఆచోటును విడిచి కదలక అందేనిలిచి నీళ్ళనేతుదకు గోరునట్లు నీయందలి ధ్యానమునందే గుఱియుంచి యెన్నికష్టములు వచ్చినను దానిని వదలకయుండువాడు. అట్లుండుటచే నీయెడల భక్తియుదయించి ఆభక్తియోగమున సంసారమును దాటునని భావము.

చ. సరసునిమానసంబుసర ♦ సజ్ఞుఁడెఱుంగునుముష్కరాధముం
డెఱిగి గ్రహించువాఁడెకొల ♦ నేకనివాసముగాఁగద ర్దురం
బరయఁగ నేర్చునెట్లు విక ♦ చాబ్జమరంద రసైకసారభో
క్కరముమిళిందమొందుక్రియ ♦ దాశరథీకరుణాపయోనిధీ 95

టీ. సరసుని మానసంబు=రసజ్ఞునిమనస్సును, సరసజ్ఞుఁడు=మిక్కిలి రసమును దెలిసినవాఁడు, ఎఱుంగును=తెలియును, ముష్కర+అధముఁడు=మొరకైననీచుఁడు, గ్రహింపగలఁడా, ఇందులకుదృష్టాంతము, దర్దురము=కప్ప, కొలను=సరస్సు, ఏకనివాసముగాఁగన్=ఒక్కచోటనే నికిపట్టుకాఁగా, (కొలనునందె ఎప్పుడును ఎడతెగక యుండునదైనను,) వికచ=ఆకొలనునందు, వికసించిన, అబ్జ=తామరయొక్క, మకరందరస=పూదేనెద్రవముయొక్క, ఏక=ముఖ్యమైన, సౌరభ=వాసనలయొక్క, ఉత్కరము=సమూహమును, మిళిందము=(దూరముననుండు) తుమ్మెద, ఒందు క్రియన్=పొందురీతిని, ఎట్లు=ఏరీతిని, అరయఁగనేర్చు=విచారించి తెలిసికొననేర్చును.

తా. రామా! కప్ప సరస్సులోనే యెప్పుడు వాసము చేయుచుండునదైనను అందుండిన తామరలయందలి పూదేనె వాసనలను తెలియఁజాలదు. తుమ్మెదయో దానిని తెలిసి యనుభవించును. అట్లే రసికుని మనస్సులోని భావమును రసికుండే తెలిసికొనగల్గునుగాని దుష్టుఁడు తెలిసికోఁజాలఁడు.

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ ద ♦ నూభవుఁ డొక్కఁడెచాలు మేటిచే
చాఁచనివాఁడు వేఱొకఁడు ♦ చాఁచినలేదనకిచ్చు వాఁడునో
రాఁచి నిజంబకాని పలు ♦ కాఁడనివాఁడు రణంబులోన మేన్
దాఁచనివాఁడుభద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 96

టీ. నోఁచినతల్లిదండ్రికిన్=పూర్వజన్మమందు పుణ్యవ్రతమునోఁచినట్టి తల్లిదండ్రులకు, చే=చేయి, చాఁచనివాఁడు=యాచింపనట్టివాఁడనుట, వేఱొకఁడు=మఱియొకఁడు, చాఁచినన్=(తన్నుగూర్చి) చెయిచాఁపఁగా, (తన్నుయాచింపగా) లేదనకిచ్చువాఁడు=యాచించునది లేదనక యిచ్చునట్టి వాఁడును, నోరు, ఆఁచి=అడ్డగించి, నిజంబ=నిజమే, (సత్యమే చెప్పువాఁడనుట) కానిపలుకు=కానట్టిమాటలను, ఆడనివాఁడు=చెప్పనివాఁడును, (అబద్ధము

చెప్పుటకు నోరు మూసికొనునే కాని నోరుతెరచి నిజమే చెప్పువాడనుట) రణంబులోన్=యుద్ధమునందు, మేన్=ఒడలిని, దాఁచనివాడు=మాటు చేయనివాఁడు, ఇట్టివాఁడైన, మేటి=శ్రేష్ఠుడగు, తనూభవుఁడు=కొడుకు, ఒక్కడే, చాలున్=చాలును, (ఇట్టిలక్షణములులేని కొడుకులు ఎందఱు పుట్టినను పుట్టనట్లేయని భావము.)

తా. ఒకరిని యాచింపనివాఁడును, ఒకరుతన్ను యాచింపఁగా లేదనకిచ్చువాఁడును,నోరుదెరచి యబద్ధముచెప్పనివాఁడును, యుద్ధమందు వెనుదీయనివాఁడును, అగుకొడుకు భాగ్యముచేసినతల్లిదండ్రులకు ఒక్కఁడే కలిగిన జాలును ! అనేకమంది అక్కరలేదు.

ఉ. శ్రీయుతజానకీరమణ ♦ చిన్మయరూప రమేశరామ నా
రాయణ పాహిపాహియని ♦ ప్రస్తుతిఁజేసితి నామనంబునం
బాయక కిల్బిషప్రజ వి ♦ పాటనమందఁగజేసి సత్కళా
దాయి ఫలంబునాకీయవె ♦ దాశరథీ కరుణాపయోనిధీ.97

టీ. శ్రీయుత=కాంతితోఁగూడినవాఁడా, జానకీరమణ=సీతాదేవికి పెనిమిటియైనవాఁడా, చిత్ + మయ=జ్ఞానమయమైన, రూపా=స్వరూపముగలవాఁడా, రమా + ఈశ=లక్ష్మికి పతియైనవాఁడా, రామా=అందఱిని రమింపఁజేయువాఁడా, నారాయణ=నారములను సకలచేతనాచేతనములను వాసస్థానముగాగలవాఁడా, పాహిపాహియని=కావుముకావుము అని, ప్రస్తుతిన్ చేసితి=స్తోత్రముచేసితిని, నామనంబునన్=నా మనస్సునందు, పాయక=విడువక, కిల్బిష=పాపములయొక్క, ప్రజ=సమూహములయొక్క విపాటనము=ఖండించుటను, అందగన్ చేసి=లభించునట్లుచేసి (నాపాపములను నాశనముచేసి యనుట) సత్కళా=మంచికళను, దాయి=ఇచ్చునట్టి, ఫలంబున్=ఫలమును, నాకు, ఇయవె=ఇమ్ము.

తా. దశరథరామా! తేజోవంతుడా! జానకీరమణా! విజ్ఞానమయా! లక్ష్మీపతీ! సర్వజనానందకరుడా! నిన్ను సదా పాహిపాహియని నుతించెదను నామనస్సునందుండు పాప సముదాయములఁబోఁగొట్టి నన్ను పాపరహితునిగజేసి రక్షింపుము.

ఉ. ఎంతటిపుణ్యమో శబరి ♦ యెంగిలిగొంటివి వింతగాదె నీ
మంతనమెట్టిదో యుడుత ♦ మైని కరాగ్రనఖాంకురంబులన్
సంతసమందఁ జేసితివి ♦ సత్కులజన్మము లేమి లెక్క వే
దాంతముగాదె నీమహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 78

టీ. శబరియెంగిలిన్=శబరి గొతికి చవిచూచుటచే ఎంగిలియైన పండ్లను, కొంటివి=తీసికొంటివి.(భక్షించితివి) ఎంతటిపుణ్యమో=అది చేసికొన్న పుణ్యము ఎంత అతిశయించినదో, వింతకాదె=ఇది ఆశ్చర్యముకాదా, (దేవతలు ఇచ్చునట్టి శ్రేష్ఠపదార్థములను గ్రహింపని నీవు, అల్పురాలైన శబరి ఎంగిలిని తినుటచూడగా దానిపుణ్యము మిక్కిలియాశ్చర్యమైనదనుట) నీమంతనము=నీరహస్యము (నీకు ఉడుతమీఁద ప్రేమాతిశయముగలుగుటను రహస్యము.) ఎట్టిదో=ఎటువంటిదో, ఉడుతమైని=ఉడుత దేహమున, కరాగ్ర=వేళ్ళయొక్క, నఖా+అంకురములన్=గోటి మొనలచేత, సంతసము అందన్=సంతోషపడునట్లు, చేసితివి=గోళ్ళతో నివిరి ఉడుతను సంతోషపెట్టితివనుట, సత్కులజన్మములు=మంచివంశమున పుట్టుకలును, ఏమిలెక్క=నీకేమిలక్ష్యము (నీవు వంశమును, జాతిని పాటింపవు అనుట) నీమహిమ=నీమహాత్మ్యము, వేదాంతముగాదె=వేదాంతముకదా, నీమహిమచే జాతిని కులమును జూడక రక్షించినట్టివాఁడవైతివని భావము.

తా. శబరియెంగిలిని తింటివి. అదియెంత పుణ్యముచేసికొన్నదో ఆశ్చర్యముగానున్నది. ఉడుతమేను మునిగోళ్ళతో

గీతి సంతోషపెట్టితివి. దానిపైనింత వాత్సల్యము గలుగుటకు రహస్యమేమో తెలియకున్నది. విచారించి చూడఁగానీవుజాతిని కులమును పాటించువాఁడవుకావు. ఔను నీమహాత్యమువేదాంత ప్రతిపాద్యమగునంత విస్తారమైనది. కాన నీరణాక్షమునకును శిక్షణమునకును కారణములు మనుఁబోటులకు తెలియవు.

ఉ. బొంకనివాఁడె యోగ్యుఁడరి ♦ బృందములెత్తినచోటఁజివ్వకుం
జంకనివాఁడెజోదు రథ ♦ సంబున నర్థికరంబు సాచినం
గొంకనివాఁడెదాత మిము ♦ గొల్చిభజించినవాఁడెపోనిరా
తంకమనస్కుఁడెన్నగను ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 99

టీ. బొంకనివాఁడె=అబద్ధము చెప్పనివాఁడే, యోగ్యుఁడు, అరిబృందము=శత్రుసమూహములు, ఎత్తినచోటన్=దండెత్తివచ్చినయెడల, చివ్వకున్=యుద్ధమునకు, జంకనివాఁడె=వెనుకతీయనివాఁడే, జోదు=యోధుడు, రథసంబునన్=వేగముగా, అర్థి=యాచకుఁడు, కరంబు=చేతిని, చాఁచినన్=చాచగా, కొంకనివాఁడె=ఇచ్చుటకు, మిణకరింపనివాఁడే, దాత, మిమ్మున్=మిమ్ము, కొల్చి=సేవించి, భజించినవాఁడె=ధ్యానము చేసినవాఁడే, నిరాతంక=ఆటంకములేని, మనస్కుఁడు=మనస్సుగలవాఁడు, అగును.

చ. భ్రమరము కీటకంబుఁగొని ♦ పాల్పడిఝుంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని ♦ పల్కుటజేసిభవాదిదుఃఖసం
తమస మెడల్చిభక్తిసహి ♦ తంబుగ జీవుని విశ్వరూప త
త్త్వమున ధరించుటేమరుదు ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. భ్రమరము=తుమ్మెద, కీటకంబున్=పురుగునుఁగొని, పాల్పడి=వానికైపూని, ఝుంకరణ+ఉపకారియై=ఝుంకారముచేత ఉపకరించి, భ్రమరము గాన్=తుమ్మెదగా, ఒనర్చునని=చేయునని, పల్కుటఁజేసి=

చెప్పుటచేత, (జనులాడుకొనుటచేత) జీవునిన్, భవ=పుట్టుక, ఆది=మొదలుగాఁగల, దుఃఖసంతమసము=దుఃఖములనెడి చీకటిని, ఎడలించి=పోఁగొట్టి, భక్తిసహితంబుగన్=భక్తితోగూడ, విశ్వరూపతత్వమునన్=నీయొక్క విరాట్స్వరూపమునందు, ధరించుట=తాల్చుట, ఏమి, అరుదు=ఆశ్చర్యము, ఒక కేవలజంతువైన తుమ్మెద, పురుగును తనవలె తుమ్మెదగా చేయుట లోకమునకు తెలియుచుండఁగా నీవు జీవునిదుఃఖములు బోఁగొట్టి భక్తినిగలిగించి వానికి నీతోడి సారూప్యమును ఒసగుట ఆశ్చర్యముగాదని భావము.

చ. తరువులుపూచికాయలగు ♦ తత్కుసుమంబులుపూజగా భవ
చ్చరణముసోకిదాసులకు ♦ సారములౌ ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబరని ♦ కాయములై విరజానది సము
త్తరణమొనర్చు జిత్రమిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. తరువులు=చెట్లు, పూఁచి=పుష్పించి, కాయలుకాఁచును, తత్కుసుమంబులు=ఆపూవులు, పూజగాకోసి పూజార్థముగా, భవచ్చరణము=నీపాదమును, సోఁకి=తాఁకి, దాసులకు=నీభక్తులకు, సారములు=శ్రేష్ఠములు, ఔ ధనధాన్యరాసులై=అగునట్టి ధనధాన్యముల కుప్పలై, కరి=ఏనుగులు, భట=బంట్లు, ఘోటక=గుఱ్ఱములు, అంబర=వస్త్రములు, వీనియొక్క నికాయములై=సమూహములై, విరజానదీ=పరమపదము ఎల్లగానుండు విరజ అను ఏటిని, సముత్తరణము=దాటుటను, ఒనర్చున్=చేయును, ఇది=నీపాదములు సోకినపూలు, చిత్రము=ఆశ్చర్యము.

తా. రామా ! చెట్లయందలి పూవులు అట్లేయుండిన యెడల కాయలగును. వానినేకోసి నీపాదములయందు పూజార్థము సమర్పింపగా అవి నీయడుగులు సోకగానే మేలైన ధనధాన్యములును ఏనుగులు, బంట్లు, గుఱ్ఱములు, వస్త్రములు మొదలైనవిగా ఇహలోకమున పరిణమించి పరమపదమును కలిగించును.

ఉ. పట్టితి భట్టరార్యగురు • పాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్
పెట్టితి మంత్రరాజ మొడి • బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ • కంజములందు దలపు పెట్టి బో
దట్టితి బాపపుంజముల • దాశరథీ కరుణాపయోనిధీ. 102

టీ. భట్టరార్య గురుపాదములు=గురువులగు భట్టరాచార్యులవారి యొక్క పాదములను, పట్టితిన్=చేపట్టితిని (వారి శిష్యుఁడనైతిని) ఈమెయిన్=ఈ దేహమున, ఊర్ధ్వపుండ్రముల్=తిరుమణి శ్రీచూర్ణములను పెట్టితిని, మంత్రరాజము=మంత్రశ్రేష్ఠమైన తిరుమంత్రమును, ఒడిబెట్టితిన్=గ్రహించితిని, దానిచేత, అయమకింకరాళికిన్=ఆయమదూతల సమూహమునకు, బొమ్మన్=కట్టితిని=జయించితి, మీ చరణకంజములందు=మీ పాదారవిందములయందు, తలంపు పెట్టి=మనస్సునుంచి, పాపపుంజములన్=పాపసమూహములను, పోన్+తట్టితిని=పోవునట్లు ఎగఁజిమ్మితిని.

తా. భట్టరాచార్యులవారి శిష్యుడనై తిరుమణి శ్రీచూర్ణములు ధరించి, తిరుమంత్రము పదేశమంది, నరకముతొలగించుకొని మీపాదారవిందములను ధ్యానించుచు, పాపములను పోగొట్టుకొన్నవాడనైతిని.

ఉ. అల్లన లింగమంత్రిసుతు • డత్రిజగోత్రజుఁడాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండన బ్ర • సిద్ధుడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి • యించితి గోపకవీంద్రుడన్ జగ
ద్వల్లభ నీకుదాసుడను • దాశరథీ కరుణాపయోనిధీ. 103

టీ. జగద్వల్లభ=జగన్నాథా, లింగమంత్రిసుతుఁడు=లింగమంత్రికొడుకు, అత్రిజగోత్రముగలవాఁడు, ఆదిశాఖ=ఋగ్వేదశాఖవాఁడు, కంచెర్ల కులోద్భవుఁడు=కంచెర్లకులమునఁ బుట్టినవాఁడు, అనన్=అనగా ప్రసిద్ధుఁ

డనై, భవదంకితంబుగాన్=నీకు అంకితముగా, ఎల్లకవుల్, నుతింపఁగా=పొగడఁగా, రచియించితిని=ఈశతము చేసితిని, గోపకవీంద్రుఁడన్=గోపకవి శ్రేష్ఠుఁడను నీకున్, దాసుడను.

తా. రామా ! నేను లింగమంత్రి కుమారుడను. నాది ఆత్రేయగోత్రము, ఋగ్వేదముశాఖ, కంచర్లకులము, పేరు గోపకవి, నీకుదాసుఁడను కవులందఱు పొగడునట్లుగా ఈశతకము రచించి, నీకు అంకితము చేసితిని.

స ం పూ ర్ణ ము.

రాజమండ్రి : శ్రీసత్యానందప్రెస్‌నందు, ముంద్రింపఁబడినది.

# నవలలు.

| | రు.అ. | | రు.అ. |
|---|---|---|---|
| పంజాబుమెయిలు | 0 12 | వ్యామోహము | 1 0 |
| విషహృదయము | 1 0 | ఫ్లవర్ గరల్ - పువ్వులపిల్ల | 0 12 |
| రమాసుందరి 1 వ భా॥ | 0 12 | అల్లరిపిల్ల | 0 12 |
| ,, 2 వ భా॥ | 0 12 | రివాల్వరు | 0 12 |
| నీవేనా ? | 0 12 | శకుంతల బి. ఏ. | 0 12 |
| టోపీదాసు | 0 6 | చదువుకొన్న భార్య | 0 12 |
| శక్తికుమారి | 0 12 | అల్లూరి సీతారామరాజు | 0 6 |
| రక్తవాహిని | 0 12 | లోకాభిరామాయణం | 0 6 |
| యింద్రజాలము | 0 12 | దొంగలనాయకుడు | 0 12 |
| రాజద్రోహి | 0 12 | పోతింతాయి | 0 12 |
| వలపులరాణి | 0 12 | ఘోరహంతకుడు | 1 0 |
| అర్ధరాత్రపువింతలు | | కన్నపుదొంగ | 0 12 |
| 3 హత్యలు | 0 12 | మోహపిశాచము 1 భా॥ | 0 12 |
| అఘోరి | 0 12 | ,, 2 భా॥ | 0 12 |
| అగ్గిరాముడు | 0 12 | ప్రతాపసింహ300పే॥గ్లేజు | 1 8 |
| నే నెవరిభార్యను ? | 1 0 | బాకుపోటు | 0 12 |
| నే నెవరిభర్తను ? | 1 0 | మగడుకానిమగడు | 0 12 |
| బలేపెండ్లి | 0 12 | రాజరత్నం | 0 12 |
| సాహసికుడు | 0 12 | పగటిచుక్క 1 వ భా॥ | 0 12 |
| భయంకరుడు | 0 12 | ,, 2 వ భా॥ | 0 12 |
| నరేంద్రుడు | 0 12 | కాలసర్పం 1 వ భా॥ | 0 12 |
| ఏకోదరులు | 0 8 | ,, 2 వ భా॥ | 0 12 |
| ప్రతిబింబములు | 1 0 | 13 వ నెంబరు గది | 0 12 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.

